


ర క్తదాన కార్యక్రమ ప్రారంభం ప. పూ. బాలాసాహెబ్‌జీ సమక్షంలో
ర క్తదానం చేస్తున్న మా॥ శ్రీ రాజేంద్రసింహ్‌జీ సర్‌కార్యవాహ

తుఫాను బా[illegible]లకు సహాయం
మా॥ శ్రీ యాదవ్‌రావ్ సహసర్‌కార్యవాహ



సంఘం నిర్మించిన ఒక గ్రామం :
దీనదయాళ్‌పురం – కృష్ణాజిల్లా



# నవభారత నిర్మాణంలో ఆర్.యస్.యస్





[illegible] తుఫాన్
[illegible] స్వయంసే[illegible]

ప్రథమ ముద్రణ :

**1985 వినాయకచవితి**

ప్రచురణ :

**సాహిత్యనికేతన్**

3-4-705/4, నారాయణగూడ

హైదరాబాద్ - 500 029

ప్రతులకు :

**సాహిత్యనికేతన్**

3-4-852, బరకత్‌పురా

హైదరాబాద్ - 500 027

**సాహిత్యనికేతన్**

ఏలూరురోడ్డు

విజయవాడ - 500 002

ముద్రణ :

**భారతముద్రణాలయం**

3-4-705/4, నారాయణగూడ

హైదరాబాద్ - 500 029

**వెల : 2 రూ॥లు**

## ముందు మాట

ఈ చిన్న పుస్తకంలో- అరవై సంవత్సరాల రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ చరిత్ర- సంస్థాపకుల గురించి, సంస్థ యొక్క ఉద్భవం, సిద్ధాంతం, ఆచరణ విధానాల గురించి తెలియజేయబడింది. అంతేగాక ఎన్నో సవాళ్ళను ఎదుర్కొంటూ సంస్థ సాధించిన అనేక విజయాలు, దాని నిరంతర ప్రగతి, వివిధ సామాజిక క్షేత్రాలపై దాని ప్రభావం, సమాజం నుండీ, ఎందరో ప్రముఖుల నుండీ సంస్థకు లభించిన హృదయపూర్వక సానుభూతి, సమర్థన, సమాజంపై సంస్థ యొక్క ప్రభావం సంక్షిప్తంగా వివరించబడింది.

సంఘం స్వీకరించిన సిద్ధాంతం, పెంపొందించిన కార్యపద్ధతి, కార్యరచన - ఆచరణలు, కార్యకర్తలకు అందజేసిన సంస్కారం, నిర్వహించిన ఉద్యమాలు- చివరకు సంఘం ఎదుర్కొన్న ఎన్నో పరీక్షలు- ఇవన్నీ కూడా ఒక నూతన దృక్పథాన్నీ, సమైక్యభావాన్నీ సమాజ హృదయంలో ఉద్దీపన చేయడానికే అని గమనించాలి. ఆ దృష్టితో ఈ పుస్తకాన్ని పరిశీలించినట్లయితే సంఘ చరిత్ర కేవలం ఒక సంస్థచరిత్ర మాత్రమే కాదని, తన కాళ్ళ మీద తాను నిలబడే ప్రయత్నం చేస్తూ, జాగృతమౌతున్న ఒక జాతి చరిత్రయని స్పష్టమౌతుంది.

మీ ముందు వున్న మా ఈ ప్రచురణ మీ హృదయపూర్వక స్వీకారాన్ని పొందగలదని ఆశిస్తున్నాం.

—ప్రచురణకర్తలు

నేటి వార్తలలో విశేషంగా ఆసక్తిని కలిగిస్తున్న సంస్థ రాష్ట్రీయ స్వయంసేవకసంఘ్. పత్రికల నిండా దీనిని గురించిన వార్తలు, వ్యాఖ్యలే. బస్సులలో, రైళ్ళలో ప్రజలు దీనిని చర్చిస్తున్నారు. రాజకీయవేత్తలు దీని రాజకీయ ప్రభావం గురించి తర్కిస్తున్నారు. అన్ని సాంప్రదాయాలకు చెందిన మఠాధిపతులు, మతనాయకులు దీనివైపు ఆకర్షితులవుతున్నారు. విద్య, సామాజిక రంగాల్లోని కార్యకర్తలు దీని నుంచి సహకారాన్ని మార్గనిర్దేశనాన్ని ఆశిస్తున్నారు. కార్మికులు కూడ రానురాను దీని ప్రభావాన్ని గ్రహిస్తున్నారు. విద్యార్థులలో దీని మాటే బాగా చెల్లుబడి అవుతున్నది. ఉపేక్షిత వర్గాలు సంఘం చూపుతున్న ప్రేమాదరాలకు ముగ్ధులై దీని ఒడిలో చేరుచున్నారు. పత్రికా రచన, సాహిత్యం, గ్రామోద్ధరణ, సాంఘిక సంస్కరణ– ఇలా ఒకటేమిటి, దీని నుంచి వెలుగును, స్ఫూర్తిని స్వీకరించని రంగమే లేదు.

ప్రతిఘటించే వారికి కూడ కొరత లేదు. పత్రికలవారు, రాజకీయవాదులు దీనినొక పెద్ద వివాదాంశంగా తయారు చేశారు. అన్ని రకాల ఆరోపణలు అపనిందలు మోపటం జరిగింది. ప్రభుత్వం కూడ రెండుసార్లు దీనిని నిషేధించింది. దీనిని అణచడానికి చేయని ప్రయత్నమే లేదు. దీనికి అపకీర్తిని ఆపాదించే ప్రయత్నంలో బాహ్య ప్రేరణతో పని చేస్తున్న అనేక శక్తులు చేతులు కలిపాయి.

ఇంత జరుగుతున్నా, ధ్యేయనిష్ఠతో ఉరకలు వేసే కార్యకర్తల సంఖ్య దిన దినాభివృద్ధి చెందుతూనే వుంది. ఒకప్పుడు దీనిని తెగిడినవారే నేడు పొగుడుతున్నారు. వివిధ రంగాలకు చెందిన ప్రముఖ వ్యక్తులు ఎందరెందరో దీనిని జాతికి ఆశాకిరణంగా పరిగణిస్తున్నారు. సంఘ కార్యకర్తలు అత్యంత విశ్వసనీయులుగా, సమర్థతకు సౌశీల్యానికి మారుపేరుగా గుర్తించబడుతున్నారు. నిజానికి మొత్తం జాతి యొక్క వైఖరిలోనే అపూర్వ పరిణామం వచ్చింది. దేశమంతటా ఎటుచూసినా సంఘ ఆలోచనకు, కార్యకలాపాలకు అనుకూలంగా ప్రజాచైతన్యంపెల్లుబుకుతోంది. 1975-77 నాటి ఎమర్జెన్సీ రోజుల నియంతృత్వాన్ని కూలద్రోయడంలో సంఘం నిర్వర్తించిన కీలకపాత్ర ఎలాంటిదో తెలుసుకున్న ప్రపంచ దేశాలు కూడ ఈ సువిశాల దేశం యొక్క భవిష్యత్తును మలచగల శక్తిగా దీనిని గుర్తించాయి.

మరి యీ ఉద్యమం వెనుకనున్న మహాప్రేరణ యేమిటి? దీనిని ఊహించి జీవమిచ్చిన ఆ మహామహుడెవరు? ఆయన ఆశయము, కార్యప్రణాళిక ఎలాటివి? ఈ ఉద్యమం యింతటి మహాశక్తిగా ఎలా రూపొందగలిగింది?

## సంస్థాపకుడు :

రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్‌ను స్థాపించాలనే ఆలోచన డా॥ కేశవబలీరామ్ హెడ్గెవార్‌కు కలిగిందంటే అది కాకతాళీయంగా జరిగినట్టిది కాదు. ఒక విధంగా ఆయన జీవితమంతా చిరుతప్రాయంనుంచే దీనికై సిద్ధపరచబడింది. అసలు అందుకే ఆయన జన్మించారా అనవచ్చు.

ఒక నూతన శకాన్ని ప్రారంభించడానికా అన్నట్లు 1889లో హిందూ సంవత్సరాదియైన ఉగాదినాడు ఆయన నాగపూర్‌లో జన్మించారు. బాలుడుగా వున్నపుడే ఆయన అడిగిన ప్రశ్నలకు పెద్దలు ఆశ్చర్య పడుతుండేవారు; "ఇంత కొద్దిమంది విదేశీయులు ఆరువేల మైళ్ళ దూరం నుంచి వచ్చి మనమీద పెత్తనం ఎలా సాగించగలుగుతున్నారు?" ఎనిమిదేండ్ల లేత వయసులో విక్టోరియా రాణి వజ్రోత్సవాల సందర్భంగా తనకు బడిలో యిచ్చిన మిఠాయిలను, "విదేశ ప్రభువుల వేడుకలకు మనం కులుకుతూ పబ్బాలు జరుపుకొనడం సిగ్గుచేటు కాదా" అంటూ విసిరికొట్టారు. హైస్కూలులో చదువుచున్న రోజుల్లోనే రాజకీయ సమావేశాలలో పాల్గొని జాతీయ నిధిసేకరణకు పాటుబడ్డారు. 1907 దసరా సందర్భంగా రాంపాయలీలో స్వాతంత్ర్య పతాకాన్ని ఎగురవేసి



డాక్టర్ కేశవరావ్
బలీరామ్ హెడ్గేవార్

ఉద్వేగంతో ప్రసంగిస్తూ బానిసత్వం నుంచి స్వేచ్ఛకు ఉద్యమించి సీమోల్లంఘనం జరపాలని పిలుపిచ్చారు. ఆనాటి నుండి తుదిశ్వాస విడిచేవరకు ఆయనను బ్రిటిషు గూఢచారులు నీడలా వెన్నంటి తిరిగారు. 1908లో 'వందేమాతరం' అంటూ నిషిద్ధ నినాదాన్ని గొంతెత్తి పలికి తోటివిద్యార్థులను ఉత్తేజితం చేశారు. అది 'రాజద్రోహ' మైనందున ఆయనకు పాఠశాల నుండి బహిష్కరించారు. దేశభక్తికి చెల్లించవలసిన మూల్యాన్ని చిరునవ్వుతో చెల్లించారు. అనేక ఊర్లు మారుతూ చివరకు పూనాలో మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులయినారు.

## వైద్యుడా? విప్లవ వీరుడా?

మెట్రిక్యులేషన్ తదుపరి ఉన్నత విద్యాభ్యాసం కోసం నాటి విప్లవ వీరు లందరికి కాశీ క్షేత్రంగా విరాజిల్లుతున్న కలకత్తాకు పోవాలని నిర్ణయించుకున్నారు. దేశభక్తియుతులైన ఆయన నాగపూర్ సహచరులు యిందుకు ఏర్పాట్లు చేశారు. వైద్యవృత్తిని చేపట్టడానికి కాక విప్లవోద్యమ సరళిని వంటబట్టించుకొనే ఉద్దేశంతో నేషనల్ మెడికల్ కాలేజీలో చేరారు. ఉజ్వల విప్లవ సంస్థ అయిన అనుశీలన సమితి లోని ప్రముఖులలో ఒకరై 'కోకెన్' అనే రహస్య నామంతో వ్యవహరిస్తూ ఎన్నొ సాహసోపేతమైన కార్యాలు నిర్వర్తించారు. బెంగాలీల జీవితంతో తాదాత్మ్యం చెంది పలువిద్యార్థి ఉద్యమాలలోను, సమాజ సేవాకార్యక్రమాలలోను చురుకుగా పాల్గొ న్నారు. దామోదరనది వరదలతో పొంగినపుడు ప్రజారక్షణ బృందంలో యువకు డైన కేశవరావు అగ్రగామిగా నిలిచి వరద బాధితులకు సహాయ సహకారాలందిం

చారు. పట్టభద్రులై రెండేండ్ల యింటర్న్‌షిప్ కూడ పూర్తి చేసుకొని డాక్టరుగా 1916లో ఆయన నాగపూర్‌కు తిరిగి వచ్చేసరికి పూలపానుపు వంటి జీవితం ఆయనకు ఎదురుగా నిలిచివుంది-ధనవంతుల నుంచి పెండ్లి సంబంధాలు, రెండుచేతులా సంపాదించుకోగల డాక్టరువృత్తి! అయితేనేం, దృఢనిశ్చయంతో వీటన్నిటిని ఆయన తృణీకరించారు. అగర్భ దరిద్రులయి వుండి కూడ జీవితపు కనీసావసరాలకు సయితం నోచుకోని లేమితోను, కష్టాలతోను నిండి వుండే మార్గాన్నే ఆయన మరల ఎన్నుకున్నారు. ఆ జీవన బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ భారతమాతృ చరణవేదికపై ఆత్మనివేదన చేసుకోవాలని ఏనాడో ఆయన ప్రతినపూనారు. వైద్యవృత్తిని చేపట్ట లేదు. జాతికి స్వస్థత కూర్చే వైద్యుడుగా కావటమే తన జీవిత లక్ష్యంగా నిర్ణయించు కొన్నారు.

## స్వేచ్ఛ కొరకై సింహ గర్జన :

దేశవిముక్తి కోసం నాడు సాగుతున్న వివిధ ఉద్యమాల గురించి ఆయన కూలంకషంగా పరిశీలన జరిపారు. లోకమాన్య తిలక్, డా॥ మూంజే, ఎమ్. ఎస్. అణే మొదలైన జాతీయ మహానాయకులతో సన్నిహిత సంబంధాలు ఏర్పరుచుకున్నారు. కాంగ్రెసు, హిందూ మహాసభలలో బాధ్యతాయుతమైన పదవులు నిర్వహించారు.

1921నాటి కాంగ్రెసు ఉద్యమంలో ఆయన పాత్ర ప్రముఖమైనది. తన ప్రసంగాలతో ఆయన నిప్పులు వెదజల్లేవారు. విదేశీ బానిసత్వపు అవమానానికి సంబంధించిన ప్రసక్తి వచ్చినప్పుడల్లా ఆయన శరీరం ఉద్వేగంతో కంపించి పోయేది. ఒకమారు అలాంటి ఉద్ధృత ప్రసంగం చేసినందుకు న్యాయస్థానానికి పిలువగా ఆయన సంజాయిషీ యిచ్చుకునే బదులు యిలా గర్జించారు; "భారత దేశంలో ఒక భారతీయుడు చేసిన పనిపై ఒక విదేశీశక్తి తీర్పు యివ్వబూనుకున్న దంటే అది నాకు, నా మహత్తర దేశానికి అవమానంగా భావిస్తాను. ఇక్కడ వున్నది మాపై బలవంతంగా రుద్దబడిన రాక్షస ప్రభుత్వం. పాశవికశక్తే దీని పునాది. చట్టాలు దీని తొత్తులుగా, న్యాయస్థానాలు దీని పనిముట్లుగా వున్నాయి. ప్రపంచంలోని ఏ భాగంలోనైనా ప్రజల చేత ఎన్నుకొనబడి, ప్రజల కొరకు పని చేసే ప్రజాప్రభుత్వానికి మాత్రమే పాలించే హక్కు ఉంది."

"భారతదేశం భారతీయులదే అనే సత్యాన్ని నా ప్రజలకు నచ్చజెప్పాలని

ప్రయత్నించాను. ఒక భారతీయుడు యిట్టి దేశభక్తిని ప్రబోధించడమే రాజద్రోహమైతే, నగ్నసత్యాలు చెప్పినంతమాత్రాన ఇక్కడి భారతీయులు - యూరోపియనుల మధ్య వైరభావాలు ప్రజ్వరిల్లితే, పరిస్థితి యింత దారుణంగా పరిణమించిందంటే- ఇక్కడి యూరోపియనులు,- తమను భారత ప్రభుత్వంగా భావించుకుంటున్నవారు- తాము యిక మర్యాదగా నిష్క్రమించవలసిన సమయం ఆసన్నమైనదని గుర్తించాలి."

ఇది విన్న మేజిస్ట్రేటు "ఆయన చేసిన ప్రసంగం కంటె దానిని సమర్థించుకున్నవైనం మరింత రాజద్రోహకరంగా వుంది" అని వ్యాఖ్యానిస్తూ ఒక యేడాది కఠిన కారాగార శిక్ష విధించాడంటే ఆశ్చర్యమేముంది?



1921 అటవీ సత్యాగ్రహంలో డాక్టర్ హెడ్గేవార్

## హిందూ రాష్ట్రం చరిత్ర సత్యం :

జైలు నుండి విడుదలయిన తదుపరి డా॥ హెగ్డెవార్ అనేక సామాజిక రాజకీయ, ధార్మిక ఉద్యమాలలో తలమునకలైనారు. ఒక వంక యివన్నీ కొనసాగిస్తూనే వీటి కంటె ముఖ్యమైన కొన్ని మౌలికమైన ప్రశ్నలకు సమాధానాలను అన్వేషించ

దంలో నిమగ్నులై నారు. పరాయి పాలన నుండి రాజకీయ విముక్తి కోసం పోరాడి నంత మాత్రాన జాతి సమస్యలన్నీ తీరుతాయా? మన పతనానికి, దుస్థితికి ఆంగ్లేయుల పాలనే కారణ మనడం సమంజసమా? మనం ఏ జాతి యొక్క స్వేచ్ఛకోసం పోరాడుతున్నామో ఆ జాతి యొక్క నిజస్వభావమేమిటి? దాని లక్షణాలేమిటి?

ఇలాంటి ప్రశ్నలన్నింటికి స్పష్టమైన సమాధానాలు ఆయనకు మన పూర్వ చరిత్ర నుండే లభించాయి. మన జాతి నిన్ననో మొన్ననో పుట్టింది కాదు. యుగ యుగాలుగా, నిజానికి ప్రపంచంలోని యితర జాతులేవీ ఆవిర్భవించకముందు నుంచే యీ జాతి యిక్కడ వున్నది. అందునా పశుప్రాయంగాగాని, అనాగరికంగాగాని లేదు పాశ్చాత్య ఆధునిక జాతులు ఆటవికత నుండి వెలుగులోకి రాకముందే, జీసను, మహమ్మదుల గురించి ప్రపంచం వినకముందే మన దేశం విజ్ఞానం, కళలు, వాణిజ్యం, తత్వశాస్త్రం, ఆధ్యాత్మికత వంటి అన్ని జీవన రంగాలలో సాధించిన అద్భుత విజయాలకు ప్రపంచమంతటిచేత నివాళులందుకున్నది. భారత కీర్తి పతాకను గైకొని మన పూర్వులు సుదూర దేశాలకు పయనించి భూగోళం మీది అసంఖ్యాకమైన ప్రాంతాలపై సాంస్కృతిక సామ్రాజ్యాన్ని ప్రతిష్ఠించారు. రాజకీయ రంగంలో కూడ దీని ప్రభావం కనిపించింది. ఆగ్నేయాసియాలోని సువిశాల ప్రాంతాలలో 400 సం॥ల పైగా హిందూ రాజుల చల్లని పాలన విస్తరించింది హిందూ ప్రజల యెడతెగని కృషి, త్యాగాల వల్లనే యిదంతా సాధ్యపడింది.

గ్రీకులు మొదలుగా మన భూమిపై కాలిడిన హూణులు, కుషాణులు, శకులు, వంటి దురాక్రమణదారులకు యుద్ధరంగంలో ఘోరపరాజయాన్ని చవి చూపించడమే కాక, ఇక్కడే మిగిలిపోయినవారిని హిందువులు తమ సామాజిక వ్యవస్థలో సంపూర్తిగా విలీనం చేసుకున్నారు. అనంతరకాలంలో దండెత్తిన ముస్లిం దురాక్రమణదారులతో కూడ 800 సంవత్సరాలపాటు హిందువులు నిర్విరామంగా పోరాడుతూ వచ్చారు— జాతీయ స్వేచ్ఛ కోసం యీ ప్రపంచంలో బహుశా మరెక్కడా జరగని అత్యంత వీరోచితమైన సుదీర్ఘ సంఘర్షణ యిది. అయితే దురదృష్ట మేమంటే మన హిందువులే తమలోని అనైక్యత, అంతఃకలహాల వల్ల జాతి పతనానికి బాధ్యులైనారు. ఈ వాస్తవాలన్నీ చరిత్రకారులందరూ— వారు విదేశీయులు గాని భారతీయులుగాని; పూర్వులుగాని ఆధునికులుగాని— స్పష్టంగా పేర్కొన్నవే. ఈ కారణంచేతనే ఇది హిందువుల మాతృభూమిగా హిందూస్థాన్‌గా పేర్కొనబడింది— అంటే యిది సాక్షాత్తు హిందూ రాష్ట్రమేనని రుజువవుతోంది.

ముస్లిం దండయాత్రలకు ఎదురు నిలచిన కాలంలోగాని, ఆ పిమ్మట బ్రిటిషు వారితో పోరాడిన కాలంలోగాని మన సామాజిక జీవనానికి నూతన చైతన్యాన్ని

అందజేయటానికై కృషి చేసి ఉద్యమ నాయకులుగా వెలుగొందిన మహాపురుషులంతా యీ హిందూ రాష్ట్రభావన నుంచి ప్రేరణ పొందినవారే. రాణాప్రతాప్, శివాజీ, విద్యారణ్యుడు, గురుగోవిందుడు, వివేకానంద, అరవింద, తిలక్, గాంధీ,సావర్కార్ - అందరి జీవన స్వప్నం ఒకటే; అందరు నొక్కి వక్కాణించినది ఒకటే; అందరు హైందవాత్మను ఆవాహన చేసి హిందూ హృదయ తంత్రిని మీటి ప్రజలను కర్తవ్యానికి ప్రేరేపించినవారే.

## హిందుత్వంపై కుట్ర:

ఈ జ్వాలను ఆర్పివేయడానికి ముస్లిం దండయాత్రికులు పాశవికమైన బహిరంగ దాడులు జరుపగా బ్రిటిషువారు మరింత సున్నితమైన పద్ధతిలో అందుకు పూనుకున్నారు. బహిరంగంగా జరిపే మొరటు దాడులవల్ల గతంలో అనేక సందర్భాలలో జరిగినట్లు హిందువులలో మానసిక జాగృతి కలిగి క్షాత్రశక్తితో విక్రమిస్తారని, బ్రిటిషువారు గ్రహించారు. కనుక హిందువుల ఆలోచనా సరళినే వక్రీకరించాలని వారు పథకం తయారు చేశారు. "నీకు గతంలో గొప్పగా చెప్పుకోదగినదేమీ లేదని, అసలు భారత్ అనేది ఎన్నడూ ఒక జాతి కానేకాదని, తెల్లవాడి అడుగుజాడలలో నీవు యిక నుంచి నాగరికత మార్గాన నడవవలసి వున్నదని హిందువుకు బోధించసాగారు. తెల్లవాడి పాలన భగవత్ప్రసాదమని, నాగరికత నేర్పడం తెల్లవాడి బాధ్యత అని, ఆర్యులు ఎక్కడి నుంచో వచ్చి భారతదేశంలో స్థిరపడ్డారని, భారతీయులు యిప్పుడిప్పుడు ఒక జాతిగా రూపొందుతున్నారని హిందువులు ఎప్పుడూ ఎవరో ఒకరికి బానిసలుగా బ్రతుకుతూ వచ్చారని, లేక హిందువులు మరణిస్తున్న జాతి అని అదే పనిగా వల్లించారు. ఆంగ్లవిద్యను అభ్యసించిన మనవారు వీటిని దివ్యసత్యాలుగా నమ్మి తమ రక్తంలో జీర్ణించుకున్నారు.

20వ శతాబ్దపు తొలి దశాబ్దాలలో హిందూ సమాజం యిట్టి జాతీయ ఆత్మవిస్మృతి అంధకారంలో కొట్టుమిట్టాడుతూ వుంది. జాతి యొక్క స్వత్వానికిసంపూర్ణ గ్రహణం పట్టింది. హిందువులను నిర్వీర్యం చేయడానికి బ్రిటిషువారు మరోపన్నాగం కూడ పన్నారు. భారతదేశ సరిహద్దులలో నివసిస్తున్న వారంతా ఒక జాతిగా వుండాలనే సిద్ధాంతం ప్రతిపాదించారు. ఇక్కడ నివసిస్తున్న అనేక వర్గాలలో హిందువులు కూడ ఒక వర్గమని అన్నారు. హిందువుల గురించి మాట్లాడటం 'మతతత్వం' (కమ్యూనల్), హిందూ అని అనడమే అపచారం అన్నట్లు వ్యవహరించారు. 'మరోవంక' 'విభజించి పాలించు' విధానం ప్రకారం బ్రిటిషువారు 'అల్పసంఖ్యాకుల

హక్కుల' మిషతో ప్రత్యేక సౌకర్యాలను కోరవలసిందిగా ముస్లింలను ప్రోత్సహించారు.

దేశంలో నాడు రాజకీయంగా ప్రభావం కలిగి వున్న కాంగ్రెసు వారితో మీరు, ముస్లింలు కలసి ఒక అభిప్రాయానికి వస్తే అధికారం మీకు అప్పగించే విషయం ఆలోచిస్తామని బ్రిటిషువారు చెప్పారు. కాంగ్రెసువారు బుట్టలో పడ్డారు. ముస్లింలీగు వారి కోర్కెలను ఒక్కొక్కటిగా ఆమోదించడం మొదలుపెట్టారు. దీనివల్లముస్లింల రాజకీయశక్తి, ప్రతిష్ఠ పెరగడంతోపాటు హిందువులలో జాతీయభావన క్రమంగా సన్నగిల్లి నశించింది.

ఈ సంతుష్టీకరణ విధానంవల్ల జాతీయ ఏకాత్మతకు కలిగే ముప్పును డా॥ హెడ్గేవార్ గుర్తించారు. స్వాతంత్ర్య పోరాటంలో ముస్లింలు పాల్గొనడాన్ని ఆయన హర్షించారనడంలో సందేహం లేదు. ఆయన దేశభక్తులైన ముస్లిం మిత్రులతో కలిసి పనిచేశారు కూడ. అయితే తాము హిందువులతో సమానమని వారు అంగీకరించాలని, తమను 'అల్పసంఖ్యాకులు'గా భావించుకోకూడదని ఆయన నొక్కిచెప్పారు. 'అధిక సంఖ్యాకులు', 'అల్పసంఖ్యాకులు' అని ఆలోచించడం మొదలెడితే జాతీయ సమైక్యత సర్వనాశనమవుతుందని అయన అన్నారు. బ్రిటిషు వారి పెత్తనం, ముస్లింల వేర్పాటువాదం అనే ఈ రెండురకాల సవాళ్ళను ఎదుర్కోవాలంటే హిందువులను మేలుకొలిపి, సంఘటితపరచి వారిలో తీవ్రమైన జాతీయ భావనను నింపడం తప్ప మరొక మార్గం లేదని అయన నిర్ణయించుకున్నారు.

## నవచైతన్యానికి నాంది :

మన గతచరిత్ర బోధించే ముఖ్యమైన మరో గుణపాఠం ఒకటున్నది. మన జాతి దుర్దశకు మూలకారణం విదేశీయులకు బానిస కావడం కాదు. ఈ జాతిలోని అనైక్యతే అందుకు హేతువు. ఈ ముఖ్యలోపం వల్లనే విదేశీయులు మనపై అధిపత్యం సంపాదించగలిగారు. అందరిని కలిపివుంచే జాతీయభావన హిందువులలో బలహీనపడటంతో జాతి పట్ల వ్యక్తి యొక్క భక్తిశ్రద్ధలు సన్నగిల్లాయి. ఎవరికి వారుగా విడిపోవటంతో హిందూ సమాజం శతాబ్దాల తరబడి విదేశీ ముష్కరులకు లొంగిపోవలసి వచ్చింది. నిజానికి మన సమాజానికి అంగబలం, అర్ధబలం అయుధ బలం అశేషంగా వుండేవి. అయితేనేం, జాతి శ్రేయస్సు కోసం అత్మనివేదన చేసుకునేందుకు వ్యక్తిని ప్రేరేపించగల జాతీయ చైతన్యం అనే ఒకఅంశం సమాజంలో కొరవడింది. ఈ తీవ్రదోషం వల్ల మనకు వేరే ఎన్ని సద్గుణాలున్నా అంతా

బాడిదలో పోసిన పన్నీరయింది.

కనుక మన ప్రజలలో యధార్థమైన జాతీయ శీలాన్ని, సమైక్యతా భావనను తిరిగి పూరించడమే సంఘం చేయదలుచుకున్న పని. ఏ అలవాట్లు, మూఢనమ్మకాలు, ఆలోచనా పద్ధతులు గత అనేక శతాబ్దాలుగా మన జాతిని విచ్ఛిన్నం చేసి నిర్వీర్యం చేశాయో వాటినన్నిటిని సమూలంగా పెకిలించి వేసి మన జాతీయ సంస్కృతిలోని శ్రేష్ఠమైన ఆదర్శాలను గ్రహించి అలవరచుకోవాలి. అది ప్రధానంగా సౌశీల్యాన్ని నిర్మించే కృషి అని, జాతీయ పునరుజ్జీవన కార్యమని వేరే చెప్పనవసరం లేదు. అది రాజకీయం కాజాలదు. అంతకంటె ఎంతో మహత్తరమైనది. అది ఏ ఒక ప్రత్యేక వర్గానికి, కులానికి, సాంప్రదాయానికి, పద్ధతికి, ప్రాంతానికి, పార్టీకి పరిమితం కాజాలదు కూడాను. సంపూర్ణ సమాజాన్ని చైతన్యంతో పునఃస్పందింపజేయడం మినహా అల్పలక్ష్యాలను అపేక్షించదు. అట్టి దేశభక్తి ప్రపూరితమైన, అనుశాసన బద్ధమైన సమాజం మాత్రమే విదేశీ శృంఖలాలను తెగద్రెంచుకొనడమేగాక భవిష్యత్తులో నయితం జాతి స్వేచ్ఛ యొక్క సంరక్షణకు ఖచ్చితమైన హామీ యివ్వ గలిగి వుంటుంది. ముందు ముందు జాతీయ పునర్నిర్మాణానికి కూడా సుదృఢమైన పునాదిగా నిలువగలుగుతుంది.

## సామాన్యుని వికాసానికి శాఖా ప్రక్రియ :

అట్టి మహోన్నత లక్ష్యసాధనకు అనువయిన 'శాఖ' ప్రక్రియను డా॥ హెగ్డేవార్ రూపొందించారు. సమాజంలోని ప్రతి ఒక్కరు జాతీయ వ్యవహారాలలో చురుకుగా పాలు పంచుకొనునట్లు చేయడమే యీ ప్రక్రియలోని విశిష్టత. సంపూర్ణ సమర్పణ చేసుకునే కొద్దిమంది మాత్రమే సమాజ కార్యం చేయగలుగుతారని, తక్కిన జనసామాన్యం సమాజ వ్యవహారాల్లో ఎటువంటి పాత్ర నిర్వహించజాలదని ప్రజలు భావించడం వలన గతంలో జాతికి ఎంతో అనర్థం జరిగింది. ప్రతి ఒక్కడు తనయొక్క, తన కుటుంబంయొక్క ప్రయోజనాలను చూసుకుంటే చాలు దానివల్ల జాతి ప్రయోజనాలు నెరవేరతాయనే అభిప్రాయం కూడ అదే విధంగా అర్థరహితమని, ప్రమాదభరితమని గత చరిత్ర నిరూపించింది.

ఈ రెండు రకాల పొరపాట్లకు తావులేని విధంగా డాక్టర్జీ దైనిక శాఖా ప్రక్రియ రూపంలో ఒక చక్కని మార్గాన్ని రూపొందించారు. అందరికి అందుబాటులో వుండే యీ పద్ధతి ప్రకారం ప్రతి వ్యక్తి ప్రతి రోజు కనీసం ఒక గంట సమయం సమాజం కోసం సమర్పిస్తాడు. ఎటువంటి తరతమ భేదాలు లేకుండ



వ్యక్తి నిర్మాణానికి, సమాజ సంఘటనకు ఆచరణాత్మక రూపం సంఘశాఖ

సమాజంలోని అన్ని వర్గాలు జాతీయ నిర్మాణ కార్యంలో పాల్గొనేటట్లుగా వారిని ప్రేరేపించి సంసిద్ధపరచడానికి అనువుగా శాఖలోని శారీరిక, బౌద్ధిక, మానసిక శిక్షణా కార్యక్రమం యోజన చేయబడింది.

సంఘం యొక్క పేరు, దాని ధ్వజము, ప్రార్థన, ప్రతిజ్ఞ, దాని భావ తరంగిణి, దాని కార్యపద్ధతిలోని వివిధాంశాలు; అన్నింటిలోనూ వ్యక్తమయ్యే సందేశం ఒక్కటే— హిందూ మానసంలో జాతి పట్ల అకలంకమైన భక్తిశ్రద్ధలను నింపడం, జాతి యొక్క వైభవౌన్నత్యాల కొరకు త్యాగభావనలను ప్రేరేపించడం.

## ఆదర్శవాదమే ఆయన ఆస్తి :

డా॥ హెడ్గేవార్ రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్‌ను స్థాపించిన సమయంలో సంఘ ఆదర్శాలైన హిందూ సంఘటన, హిందూ రాష్ట్రం అనే ఆలోచనలే పలువురికి దిగ్భ్రాంతి కలిగించాయి. దీనిని కమ్యూనల్ అని, జాతి వ్యతిరేకమని అనేకరకాలుగా ఆడిపోశారు. హిందూ ఆదర్శం పట్ల సానుభూతిగలవారు సహితం ఇదెంతమాత్రం ఆచరణసాధ్యంకాని ఆలోచన అని, లక్ష్యం సాధించడం అసంభవమని భావించారు. గత వేయి సంవత్సరాలుగా శత్రువుల చేత అన్ని విధాలుగ ధ్వంసం చేయబడి అంతః కలహాలతో అనైక్యతతో ముక్కలు చెక్కలుగా చీలివున్న సమాజాన్ని చైతన్య

వంతం చేసి తిరిగి సంఘటితపరచడమనేది వారి ఊహలకు అందని ఆలోచన.

అయినా డా॥ హెడ్గేవార్ తన రక్తంలోని అణువణువును ధారపోసి నెమ్మదిగా ప్రశాంతంగా సంస్థా నిర్మాణ కార్యం కొనసాగించారు. ఉజ్వలమైన ధ్యేయనిష్ఠ, అజేయమైన సంకల్పశక్తి, నిరుపమాన సంఘటనా కౌశల్యము– వీటికి తోడు స్పష్టమైన జాతీయ అవగాహన– ఇవే ఆయన వద్దనున్న సంపద. 'క్రియా సిద్ధిః సత్త్వే భవతి మహతాం నోపకరణే' అనే సుభాషితమంటే ఆయనకెంతో మక్కువ. మహనీయులు తమ స్వశక్తితో కార్యసాధన చేస్తారేతప్ప బాహ్యమైన సాధనాలమీద ఆధారపడరని దాని భావం.

నాటి రాజకీయ కల్లోలాల నడుమ చాకచక్యంతో సంఘ నౌకను డాక్టర్జీ నడిపిన తీరు నిజంగా సాటిలేనిది. స్వయంసేవకుల హృదయాలలో స్వాతంత్ర్య పిపాసను పెంపొందిస్తూనే ముఖ్యకార్యమైన హిందూ సంఘటనకు నష్టం వాటిల్లకుండా ఆయన జాగరూకత వహించేవారు. 1930లో గాంధీజీ సత్యాగ్రహం ప్రారంభించినపుడు కొందరు ముఖ్యసహచరులతోపాటు డాక్టర్జీ కూడ పాల్గొని అరెస్టు కావాలని నిర్ణయించుకున్నారు. వారందరికి 9 నెలల కఠిన కారాగారశిక్ష విధించబడింది. తాము ఉద్యమంలో పాల్గొన్నది వ్యక్తిగత హోదాలో మాత్రమేనని డాక్టర్జీ స్పష్టం చేశారు. అలా స్వాతంత్ర్య సాధనకు ఒక వంక కృషి చేస్తూనే అన్నిటికంటె ముఖ్యమైన సంఘటనా కార్యానికి ఎట్టి విఘాతం కలుగనీయని అసామాన్యమైన సాంప్రదాయాన్ని ఆయన నెలకొల్పారు.

అంతకుముందు ఏడాది క్రిందట 1929 జనవరి 26న సంపూర్ణ స్వాతంత్రాన్ని లక్ష్యంగా కాంగ్రెసు ప్రకటించగా డాక్టర్జీ ఆ రోజు అన్ని శాఖలలో పథ సంచలనం, ప్రసంగాలు, దేశభక్తి గీతాలు నిర్వహించవలసిందిగా ఆదేశించి కాంగ్రెసు తీసుకున్న సాహసోపేతమైన దేశభక్తియుతమైన నిర్ణయాన్ని ప్రశంసించారు.

ఆ సందర్భంగా జారీ చేసిన సర్క్యులర్లో "సంపూర్ణ స్వాతంత్ర్యమే తమ లక్ష్యమని అఖిల భారత కాంగ్రెసు తీర్మానించడం సంఘ సభ్యులమైన మనకు సహజంగానే ఎంతో ఆనందాన్నిస్తున్నది. ఆ లక్ష్యసాధనకై కృషి చేసే ఏ సంస్థతో నయినా సహకరించడం మన కర్తవ్యం" అని పేర్కొన్నారు.

## తల ఒగ్గిన ప్రభుత్వం :

అటుపిమ్మట డాక్టర్జీ సంఘ నిర్మాణ మహాకార్యానికే తమ శక్తియుక్తులనన్నిటిని సమర్పించారు. ప్రజానాయకులు కూడ సంఘాన్ని అభినందించడం ప్రారం

ళించారు. ప్రభుత్వం కూడ సంఘంపై నిఘా వేసి వుంచింది. 1929లో సంఘాన్ని బ్రిటిషువారు నిషేధిస్తారనే వార్తలు పుట్టాయి. త్వరలోనే ప్రభుత్వం అలాంటి ప్రయత్నం చేసింది కూడాను. ప్రభుత్వోద్యోగులుకాని, మునిసిపల్ లేక జిల్లా బోర్డు ఉద్యోగులుకాని సంఘశాఖలలో పాల్గొనకూడదని నిషేధిస్తూ 1932; 1934లలో మధ్యప్రాంత ప్రభుత్వం ఆజ్ఞలను జారీ చేసింది. అయితే అనేక మునిసిపల్ కమిటీల నుంచి, జిల్లా బోర్డుల నుంచి ప్రభుత్వం తీవ్రమైన ప్రతిఘటనను ఎదుర్కొనవలసివచ్చింది. ఈ పోరాటం అసెంబ్లీదాకా పోయింది. హోంమెంబరు, ముగ్గురు ఆంగ్ల సభ్యులు మినహా అసెంబ్లీలో మాట్లాడిన ప్రతి వ్యక్తి ప్రభుత్వ చర్యను నిరసించి, ప్రభుత్వ ఆదేశాలకు వ్యతిరేకంగా ప్రవేశపెట్టబడిన తీర్మానాన్ని సమర్థించారు. సంఘంమీద ప్రభుత్వం మోపిన మతతత్వ ఆరోపణలను బీహారుకు చెందిన ఎస్. ఎమ్. రహమాన్ తదితర ముస్లింసభ్యులు ఖండిస్తూ సంఘం ఏడుసంవత్సరాలుగా పని చేస్తున్నా ఏ ముస్లిం సంస్థ ఎట్టి అభ్యంతరం లేవదీయలేదని స్పష్టం చేశారు. తీర్మానాన్ని ఓటుకు ప్రతిపాదించగా తీర్మానం నెగ్గింది. ప్రభుత్వం తల ఒగ్గింది. కొంత కాలానికి మంత్రివర్గమే రాజీనామా చేయవలసివచ్చింది.

## దేశభక్తుల హృదయాలను ఆకట్టుకొన్న సంఘం :

కుల, వర్గ, రాజకీయ పరిధుల నతిక్రమించి దేశభక్తులందరి హృదయాలను సంఘం ఆకట్టుకోగలిగిందని స్పష్టమైంది. డాక్టర్‌జీ పనిచేసే తీరు సంఘానికి ఎంతో ప్రయోజనం చేకూర్చింది. అన్ని దృక్పథాలకు చెందిన జాతీయ నాయకులకు సంఘాన్ని పరిచయం చేయడానికి ఆయన ప్రత్యేక శ్రద్ధ తీసుకునేవారు. నాగపూర్‌లో మొట్టమొదటి శాఖ ప్రారంభమైన మోహితేవాడ మైదానంలోని శాఖకు నాటి కేంద్ర అసెంబ్లీ స్పీకరు శ్రీ విఠల్‌భాయి పటేల్ సందర్శించి "ఇంతవరకు ఎక్కడ చూచినా చైతన్యం లేని సంస్థలే నాకు కనిపించాయి. కాని యిక్కడ మాత్రం దేశభక్తి ప్రపూరితులు, సాహసశీలురైన ధీరులను మొదటిసారిగా చూస్తున్నాను" అని ప్రశంసించారు.

అదే విధంగా 1933లో నాగపూర్‌లో జరిగిన మహారాష్ట్ర సాహిత్య సమ్మేళనానికి అధ్యక్షత వహించిన శ్రీ కృష్ణాజీ ప్రభాకర ఖాదిల్కర్ తన కార్యక్రమాల్లో కొంత తీరిక చేసుకొని మరికొందరు సాహితీవేత్తలతోపాటు వచ్చి సంఘ తరుణ శిబిరాన్ని సందర్శించి "మేము పదాల మధ్య కొట్టుమిట్టాడే రచయితలం. కాని యిక్కడ మాకు కనిపిస్తున్నది సజీవమైన దైవీశక్తి" అన్నారు.

డాక్టర్ జీ 1928లో కలకత్తా కాంగ్రెసు సభలలో సుభాష్‌చంద్ర బోసును కలుసుకున్నారు. ఎంతటి దేశభక్తియుతమైన అనుశాసనబద్ధమైన యువశక్తిని డాక్టర్ జీ నిర్మిస్తున్నారో తెలుసుకున్న సుభాష్‌బాబు అట్టి మౌలికకృషి ద్వారానే జాతీయ విముక్తి సాధ్యపడుతుందన్న విశ్వాసం ప్రకటించారు.

పండిత మదన మోహన మాలవ్యా సంఘశాఖను సందర్శించినపుడు ఆసక్తికరమైన సంభాషణ జరిగింది. మొహితేవాడ శిధిలస్థితిని గమనించిన పండిత్ జీ సంఘానికి డబ్బు లేనందుకు జాలిపడ్డారు. నిధిసేకరణోద్యమాలలో కాకలుతీరిన పండిత్ జీ సంఘానికి కూడ నిధులు సేకరించిపెడతానన్నారు. అయితే డాక్టర్ జీ సవినయంగా అభ్యంతరం తెలుపుతూ "మాకు మీ ఆశీస్సులు కావాలి, డబ్బు అవసరం లేదు" అన్నారు. పండిత్ జీ విస్మితులై "చాల సంస్థలు ముందు డబ్బు గురించే ఆలోచిస్తాయి. మీరు మాత్రం అందుకు విరుద్ధంగా కనిపిస్తున్నారు. అన్నింటి కంటె హృదయానికి ప్రాధాన్యమిస్తున్నారు." అని ప్రశంశించారు.

1939 లో పూనేలో జరిగిన సంఘ శిబిరంలో డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ ప్రసంగిస్తూ సంఘంలోని సామాజిక సమానత్వ భావాన్ని, సామరస్యాన్ని ప్రత్యేకంగా అభినందించారు. "సంఘ స్వయంసేవకుల శిబిరాన్ని నేను సందర్శించడం యిదే మొదటిసారి. ఇక్కడ సవర్ణులు హరిజనుల మధ్య సంపూర్ణమైన సమానత్వం నెలకొనివుండటం, అసలు అలాంటి విభేదాలకు సంబంధించిన స్పృహ అయినా వారిలో లేకపోవడం నాకు ఆనందాన్నిస్తున్నది" అన్నారు.

## గాంధీజీకి ఆనందమూ, ఆశ్చర్యమూ :

వార్ధాలోని సంఘ శిబిరాన్ని గాంధీజీ సందర్శించిన చారిత్రాత్మక సంఘటన, ఆ పిమ్మట ఆయన డాక్టర్ జీతో సమావేశం కావడం 1934లో జరిగింది. గాంధీజీతో పాటు మహాదేవ దేశాయి, మీరాబెన్ మరికొందరు వచ్చారు. శిబిర ఏర్పాట్లలోని నిరాడంబరతకు, పొదుపరితనానికి గాంధీజీ ఎంతగానో ఆనందించి అటువంటి దృశ్యాన్ని తాను యింతవరకు దేశంలో మరెక్కడా చూడలేదన్నారు. కులతత్వం, అస్పృశ్యత మచ్చుకయినా లేకపోవడం చూచి ఆయన ఎంతో ముగ్ధులైనారు. శిబిరంలో కలిసి వుంటూ కలిసి తింటున్న స్వయంసేవకులలో అన్ని కులాలకు చెందిన వారున్నా కుల ప్రసక్తి వారిలో లేని విషయాన్ని ఆయన వ్యక్తిగతంగా జరిపిన సంభాషణల ద్వారా తెలుసుకొని విస్మయానందాలకు లోనయినారు.

డాక్టర్‌జీ ఆ మరునాడు గాంధీజీని కలుసుకున్నారు. ఆ సందర్భంగా 'స్వయంసేవక్' గురించి తాను తెలుసుకొనగోరుతున్నానని డాక్టర్‌జీని అడుగగా డాక్టర్‌జీ వివరిస్తూ సంఘులోని స్వయంసేవక్ అంటే జీతం బత్తెం లేకుండా పనిచేసే సేవకుడులాంటి వాడు కాదని, తనకు తానుగా దేశసేవ కోసం ముందు కురికిన శ్రద్ధాన్వితుడైన కార్యకర్త అనిచెప్పారు. 'స్వయంసేవకుడికి', 'నాయకుడికి' మధ్య తారతమ్యం లేదు. అంతా స్వయంసేవకులే. అంతా సమానంగా ప్రేమ, గౌరవాలకు పాత్రులే. సంస్థకు సంబంధించిన ఖర్చుల భారాన్నంతటిని కూడ భరించడంలో స్వయంసేవకులు ప్రదర్శిస్తున్న సమర్పణ భావన వారి కఠోర నిరాడంబర జీవన

సేవ, ఆత్మ సమర్పణా భావనతో ప్రేరితమైన సంఘం
తప్పక అభివృద్ధి చెందుతుంది : గాంధీ



సరళి చూసి గాంధీజీ ముగ్ధులైనారు. డాక్టర్‌జీ ఏ వృత్తినిగాని చేపట్టలేదని వివాహమైనా చేసుకోలేదని తెలుసుకున్న పిమ్మట గాంధీజీ "ఓహో! అందుకే యింత తక్కువ కాలంలో అంత విజయం సాధించగలిగారు" అన్నారు.

## హిందుత్వానికి శ్రీరామ రక్ష:

సంఘకీర్తి సుదూర ప్రాంతాలకు కూడ విస్తరించింది. 1938లో న పంజాబ్ ప్రధాని సర్ సికందర్ హయాత్‌ఖాన్ స్వయంసేవకులను ఆహ్వాని వారితో ముచ్చటిస్తూ "ఒకనాటికి సంఘం భారతదేశంలో గొప్పశక్తిగా గుర్తింపు పొందుతుంది. యువకులైన మీకు నా ఆశీస్సులు" అన్నారు.

అదే సంవత్సరం హైదరాబాద్ నిజాం యొక్క హిందూ అణచివేత విధానాలకు వ్యతిరేకంగా వీరసావర్కార్ నేతృత్వంలో చరిత్రాత్మకమైన భాగానగర్ సత్యాగ్రహం జరిగింది. సంఘ కార్యకర్తలు శ్రీ భయ్యాజీ దాణే, శ్రీ మాధవరావు మూల్యే ఆ ఉద్యమంలో అగ్రభాగాన నిలిచారు. దాదాపు 2, 000 మంది స్వయంసేవకులు కూడ సత్యాగ్రహంలో పాల్గొన్నారు.

స్వయంసేవకులు ఎలాంటి సామాజిక పాత్ర నిర్వహించాలని ఆశించబడుతున్నదో అందుకు అవసరమైన ఆలోచనాపద్ధతి సన్నద్ధత వారిలో పెంపొందించడానికి డాక్టర్‌జీ ఎంతో శ్రమ తీసుకున్నారు. 1926లోనే రామ్‌టేక్‌లో జరిగిన రామనవమి యాత్రకు డాక్టర్‌జీ స్వయంసేవకులను గణవేష (యూనిఫారం)లో తీసుకువెళ్ళి వారిలో సమాజసేవా భావనకు అంకురార్పణ చేశారు. అక్కడకు వచ్చిన అసంఖ్యాకులైన యాత్రికులను క్రమబద్ధం చేసి దైవదర్శనం సక్రమంగా జరగడానికి, ఇతర సౌకర్యాలను కలుగజేయడానికి వారు తోడ్పడ్డారు.

1927లో వేలాదిమంది ముస్లింలు మారణాయుధాలతో లక్ష్మీపూజ రోజు నాగపూర్‌లోని హిందువులమీద అల్లా హో అక్బర్, దీన్‌దీన్‌వంటి నినాదాలం దాడి ప్రారంభించగా, అప్పటికే జాగరూకులై వున్న స్వయంసేవకులు ఎదురుదెబ్బ తీయడానికి సిద్ధపడ్డారు. స్వయంసేవకులను చూచినమీదట యితర హిందువు కూడ వచ్చి కలిశారు. ముస్లిం మతోన్మాదులకు మరపురాని గుణపాఠం నేర్పడం హిందువులు మొదటిసారిగా కృతకృత్యులైనారు.

ప్రభుత్వ ప్రోత్సాహంతో దాడికి పూనుకునే ముస్లింలనునిరోధించి హిందువు ధార్మిక హక్కులను సముద్ధరించడానికై 1936లో పూనాలో జరిగిన ప్రఖ్యా స్తోన్యా మారుతి సత్యాగ్రహంలో కూడ డాక్టర్‌జీ పాల్గొన్నారు.

# కార్యం విస్తరించింది, జీవనం అస్తమించింది

అపరిమితమైన ప్రయాన, దానికి తోడు విశ్రాంతి లేకపోవడం వలన డాక్టర్‌జీ ఆరోగ్యం క్రమంగా క్షీణించసాగింది. 1940 వచ్చేనాటికే ఆయన తరచుగా అస్వస్థతకు గురవుతుండేవారు. 1940 మేలో ఆయన తీవ్రమైనజ్వరంతో మంచం పట్టి వుండగా తూర్పు బెంగాలులోని హిందువుల దయనీయస్థితికి ఏదైనా పరిష్కారం కనిపెట్టే విషయమై ఆయనతో కొద్దిసేపు చర్చించడానికి బెంగాలునుంచి డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ వచ్చారు.

సంఘ రూపంలో ఉదయించిన హిందూ శక్తిని గమనించిన సావర్కార్ 1940 మేలో పూనాలోని శిక్షణా శిబిరంలో స్వయంసేవకుల నుద్దేశించి ప్రసంగిస్తూ భవిష్యత్తును దర్శిస్తున్న ద్రష్ట వలె యిలా అన్నారు: "హిందూసమాజం నేడున్న యీ దయనీయమైన స్థితిలో సంఘం ఏకైక ఆశారేఖగా గోచరిస్తున్నది. ప్రపంచంలో పునరుజ్జీవనం పొందుతున్న జాతులన్నీ ఏమి చేస్తూ వచ్చాయో సంఘం నేడు చేస్తున్నది కూడ అదే. బలహీనులు సంఘటితం కావడం ద్వారా మాత్రమే శక్తివంతులుగా రూపొందుతారు. జాతి సంరక్షణ కోసం గతంలో ఎన్నో ఉద్యమాలను మనం నిర్వహించి వున్నాం. కాని అవేవీ చెప్పుకోదగ్గ విజయాన్ని సాధించలేక పోయాయి. కనుక మన జాతికి ఏకైక అశాకిరణం యీ మహత్తర సంస్థలో మాత్రమే వున్నదని నేను పునరుద్ఘాటిస్తున్నాను."

అదే నెలలో అన్ని ప్రాంతాల నుండి ఎంపిక చేయబడిన స్వయంసేవకులు నాగపూర్‌లో 40 రోజుల శిక్షణ శిబిరంలో పాల్గొన్నారు. వారి నుద్దేశించి డాక్టర్జీ ప్రసంగిస్తూ "పునరుజ్జీవనం పొంది పునర్వ్యవస్థీకృతమైన హిందూరాష్ట్ర సూక్ష్మ రూపాన్ని నేను చూడగలుగుతున్నాను" అన్నారు.

1940 జూన్ 20న సుభాష్ చంద్రబోస్ డాక్టర్జీని చూడటానికి వచ్చారు. అయితే అప్పటికే డాక్టర్జీ మరణశయ్యపై వున్నారు. ఏ విషయం మాట్లాడేందుకు కూడ అవకాశం లేకపోయింది. సుభాష్‌బాబు చేతులు జోడించి ప్రణామం చేసి వెళ్ళిపోయారు. మరునాడే డాక్టర్జీ అస్తమించారు.

సంస్థ యొక్క విస్తరణ కోసం పదిహేను సంవత్సరాలపాటు డాక్టర్‌జీ నిర్విరామంగా అకుంఠిత దీక్షతో పరిశ్రమించారు. ఆ సమయంలో డాక్టర్‌జీలోని ప్రచండ జ్యోతిశక్తికి వారి ఉక్కు శరీరం సహితం తట్టుకోలేకపోయింది. తన జీవితాన్నే ఒక అంగా చేశారాయన. చివరిదాకా అది వెలుగుతూనే వుంది. అట్టి సాటిలేని మేటి

నాయకుడు కన్ను మూశారు. ఇంకా పసితనం వీడని సంస్థకు అదొక కోలుకోలేని దెబ్బ. అయితే డాక్టర్‌జీ తన తోటి కార్యకర్తల హృదయాలలో వ్యక్తి విధేయతా బీజాలను నాటలేదు. ధ్యేయంపట్ల మాత్రమే నిష్ఠను కలిగివుండేలా తీర్చిదిద్దారు వారిని. డాక్టర్‌జీ భౌతికదేహం పంచ భూతాలలో విలీనమైపోయాక త్యాగ, సేవా తత్పరతతో సమర్పితమైన వారి జీవితమందించిన స్ఫూర్తియే సంఘానికి వార సత్వంగా సంక్రమించింది.

## ఉద్యమానికి నూతన నాయకుడు :

తనువు చాలించకముందే డాక్టర్‌జీ దూరదృష్టితో సంస్థకు భవిష్యత్ మార్గ దర్శిని నియమించారు. సంఘనౌకను నడిపే భారం మోపబడిన యీ నూతన చోదకుడు దానిని సురక్షితంగా నడిపి తమ కలలు పండిస్తాడనే సంపూర్ణ విశ్వాసం తోనే ఆయన తుదిశ్వాస విడిచారు. ఆ నూతన నాయకుడు శ్రీ మాధవ సదాశివ గోళ్వల్కర్ – శ్రీ గురూజీ. తన తల్లిదండ్రులకు దక్కిన ఏకైక సంతానమయిన శ్రీగురూజీ బాల్యం నుండే అసాధారణ ప్రజ్ఞాపాటవాలను కనబరిచారు. ఎమ్. ఎస్. సి., ఎల్ ఎల్. బి. చదివినా ఏదో ఒక వృత్తికిగానీ, కుటుంబ జీవితానికి కానీ పరిమితమై జీవించే తత్వం కాదు వారిది. అప్పటికే వారు డాక్టర్‌జీ యొక్క ఆకర్షణ శక్తికి లోనై ఆయన పాదాల చెంత తమ జీవితాన్ని సమర్పించ నిశ్చయించుకున్నారు.



శ్రీ మాధవ
సదాశివ గోళ్వల్కర్

## కాంగ్రెసు లొంగుబాటు ; దేశ విభజన :

శ్రీ గురూజీ సంఘ నాయకత్వం స్వీకరించిన నాటికి దేశం భయంకరమైన కల్లోల పరిస్థితిలో చిక్కుకొని వుంది. ముస్లిం లీగు 'పాకిస్తాన్ తీర్మానం' ఆమోదించింది. ముస్లింలలో రానురాను ఆకతాయితనం, హింసాప్రవృత్తి పెచ్చుపెరుగుతున్నది. 1942లో 'క్విట్ ఇండియా' ఉద్యమం వచ్చింది. తొలుత ఉవ్వెత్తున ప్రారంభించిన యీ ఉద్యమం ప్రభుత్వం తీసుకున్న అణచివేత చర్యల ఫలితంగా త్వరలోనే చప్పబడిపోయింది. దీనితో ప్రజల మనస్సులలో ఒక నిస్పృహ, నిరాసక్తతలు ఆవరించాయి.



దేశమంతటా శాఖలను విస్తరింపజేయటానికి సంఘ కార్యకర్తలు తమ శక్తి, యుక్తులనన్నిటిని కేంద్రీకరించారు. ముస్లింల మంకుతనం వల్ల క్రమేపి పెరుగుతున్న సవాలుకు సంఘమే తగిన సమాధానమని ప్రజలకు అనిపించింది. డాక్టర్‌జీ గురూజీల తేజోవంతమైన వ్యక్తిత్వాల నుంచి స్ఫూర్తి గ్రహించిన ఆ జీవన ప్రచారకుల బృందం హిందూ సమైక్యతా జ్యోతిని చేపట్టి సుదూర ప్రాంతాలకు తరలి వెళ్ళడం మొదలయింది. ఈ ప్రచారకులు అన్ని రకాల శీతోష్ణస్థితులతో, ఆహారపు అలవాట్లతో, ప్రాంతాలతో, భాషలతో, కులాలతో, వర్గాలతో, తాదాత్మ్యం చెంది సంఘటనా కార్యాన్ని సమారంభించారు. అంతఃకలహాలను మరచి తామంతా సుసంఘటితంగా లేచి నిలువకపోతే ఆ బ్రిటిషు సామ్రాజ్యవాదులు, ముస్లిం మతోన్మాదులు కలసి పన్నుతున్న కుట్రలో తాము సంపూర్ణ వినాశం పొందటం తథ్యమని హిందువులు త్వరగా గ్రహించడం మొదలుపెట్టారు.



1945లో రెండవ ప్రపంచయుద్ధం ముగిసేనాటికి బ్రిటిషువారు యిక భారత దేశంలో తమ తట్టబుట్ట సర్దుకొనడం మంచిదని గ్రహించారు. తమ వనరులు, బలశక్తులు పూర్తిగా హరించుకుపోవడంతో దూర ప్రాంతాలను గుప్పిటలో ఉంచుకొనలేక "యుద్ధమైతే గెలిచాం కాని సామ్రాజ్యం పోగొట్టుకున్నాం" అనే స్థితికి బ్రిటిషువారు వచ్చారు. సుభాష్‌బోసు యొక్క అజాద్ హింద్‌ఫౌజ్ తలపెట్టిన విముక్తి యుద్ధం వల్ల భారతీయ సైనికదళంలో కూడ బ్రిటిషు వారికి వ్యతిరేకంగా అసంతృప్తి ప్రారంభం కావడంతో దేశంలో బ్రిటిషు రాజ్యానికి కాలం చెల్లినట్లు తెలిసిపోయింది. ఇక తాము వెళ్ళిపోతామని చెప్పి– 1948 జూన్ చివరిలోగా– అని ముహూర్తం కూడ ప్రకటించారు. ఇక స్వాతంత్ర్య సమరపు తుదిఘట్టం ఆసన్నమైన విషయం స్పష్టమైంది. ఈ పోరాటం రాజకీయ స్వేచ్ఛ కోసం మాత్రమే కాదు, అంతకంటె ముఖ్యంగా ఈ దేశపు సమైక్యత, సమగ్రతల పరిరక్షణ కోసం కూడాను.

అయితే స్వాతంత్ర్య సమరానికి సారథ్యం వహిస్తున్న కాంగ్రెసు మాత్రం జాతి దురదృష్టంవల్ల ఆనాటి సవాల్‌కు తగురీతిని ప్రతిస్పందించలేకపోయింది. ముస్లిం మతోన్మాదానికి పాలు పోసి పెంచిన కాంగ్రెసు మనస్తత్వం ఆత్మహత్యా సదృశంగా తయారయింది. స్వాతంత్ర్యోద్యమపు మహత్తర సమరగీతమైన వందే మాతరాన్ని కాంగ్రెసు కుదించింది; హిందీని ఉర్దూమయం చేసింది; శివాజీ, రాణా ప్రతాప్, గురుగోవిందుల వంటి స్వాతంత్ర్య యోధుల ప్రస్తావన కాంగ్రెస్ వేదికల మీద రాకుండా నిషేధించింది- ఈ చర్యలన్నీ ముస్లింల మొండితనాన్ని సంతృప్తి పరచడానికే. అనుకున్నట్లే వీటివల్ల జాతీయవాదశక్తులకు చావుదెబ్బ తగిలింది. దేశాన్ని పవిత్ర మాతృభూమిగా, భారతమాతగా ఆరాధించే సమగ్ర భారత భావనకు స్వస్తి పలకడం జరిగింది. నిజం చెప్పాలంటే భారత్ అనేది ఒకే అవిభాజ్యమైన జాతియనే నమ్మకం సహితం కాంగ్రెసులో క్రమంగా సడలింది. ముస్లింలను ఒప్పించి ప్రధాన జాతీయ ప్రవాహంలో వారిని జీర్ణించుకునే స్పష్టమైన ధీరోచితమైన జాతీయ వాద వైఖరిని అవలంబించడానికి మారుగా అదే పనిగా రాజీపడుతూవచ్చి మతోన్మాద బలిపీఠంమీద జాతీయ భావనను బలి పెట్టింది.

అయితే పైన చెప్పిన రాజీలేని జాతీయ విధానం విజయవంతం కావాలంటే హిందువుల హృదయాలలో తమ మాతృభూమిపట్ల, దేశస్వాతంత్ర్యం పట్ల సాహసోపేతమైన భక్తిశ్రద్ధలను జాగృతం చేయవలసి వుంది. ముస్లింల మద్దతు అనే ఎండమావుల వెంటబడి మౌలికమైన జాతీయశక్తి అనే జలాశయమునకే కాంగ్రెసు గండి పెట్టింది. ఫలితంగా తుదిదశలో ముస్లింలీగు, హింస, రక్తపాతాలను ప్రజ్వరిల్లజేసి కాంగ్రెసుకు ఎదురు నిలిచినపుడు పరిస్థితిని ఎదుర్కొనే సామర్థ్యంలేక ముస్లింలీగ్ యొక్క పాకిస్తాన్ కోరికకు కాంగ్రెసు దాసోహమన్నది.

## హిందూ జన సమైక్య కేంద్రంగా సంఘం :

ఒక ప్రక్క సంఘ పతాక క్రింద దేశమంతటా వేలాదిమంది హిందూ యువకులు దుర్భేద్యమైన జాతీయశక్తిగా సంఘటితం కావడం వేగంగా జరిగి పోతున్నది. ధీరత్వము, అనుశాసనము, జాతి కోసం సర్వసమర్పణ చేయడం వంటి సద్గుణాలలో వారు శాఖలలో సుశిక్షితులైనారు.

సంఘ నాయకులైన శ్రీ గురూజీ మెరుపువలె దేశమంతటా పర్యటించడం వల్ల హిందువులకు ఎంతో ధైర్యోత్సాహాలు లభించాయి. శ్రీ గురూజీ తమ స్ఫూర్తి దాయకమైన ఉపన్యాసాలతో భారతమాత యొక్క అఖండ స్వరూపాన్ని

ముందుంచి ఆ అఖండతను పరిరక్షించడానికి ఎంత త్యాగానికైనా వెనుదీయరాదని ఉద్ఘోషించారు. అయినా దేశవిభజనను అంగీకరిస్తూ కాంగ్రెస్ నాయకులు తీసుకున్న విషాదకర నిర్ణయానికి జాతి యావత్తు నిశ్చేష్టితమయింది. ఉవ్వెత్తున ప్రజ్వరిల్లిన హింసాకాండను, ఎవరికీ భద్రతలేని స్థితిని చూచి సర్దార్ పటేల్ సహితం ప్రతివ్యక్తి ఒక రక్షకభటుడుగా మారాలని పిలుపు యివ్వవలసివచ్చింది. హిందూ ప్రజలంతా సంఘం మాత్రమే తమను సంఘటితం చేయగలదని తమ మానప్రాణాలను ...ంచగలదని భావించారంటే ఆశ్చర్యం లేదు. అన్నిటికి మించి పాకిస్తానుగా పొందనున్న ప్రాంతాలలోని హిందువులపై మహా విపత్తు వచ్చిపడింది. ఈ ఆపదను ఎదుర్కొనడానికి భరించరాని బాధలను సైతం సహించే, ఎన్నో త్యాగాలు చేసే సన్నద్ధత, ధీరత్వము, పట్టుదల అవసరం. సంఘ స్వయంసేవకులు ఈ సవాలును ధైర్యంగా అందుకున్నారు.

## ఆర్.యస్.యస్. కాక మరెవరు ?

హంతకులైన మతోన్మాదుల బారి నుండి పశ్చిమ పాకిస్థాన్‌లో మన హిందూ సోదర సోదరీమణులను రక్షించడంలో సంఘ స్వయంసేవకులు నిర్వహించిన పాత్ర చెప్పాలంటే ప్రొ॥ ఎ. ఎన్. బాలి తన 'నౌ యిట్ కెన్ బి టోల్డ్" అనే గ్రంథంలో చెప్పిన విషయాన్ని ఉదహరించడం మంచిది; "ఈ స్థితిలో ప్రజలను రక్షించవచ్చిన దెవరు– ఆర్. యస్. యస్.గా పేరు పొందిన నిస్వార్థులైన హిందూ యువజన బృందం తప్ప? ప్రమాదభరితమైన స్థలాల నుంచి హిందూ, సిక్కు మహిళలను, పిల్లలను సురక్షిత ప్రదేశాలకు తరలించే పని ఆ ప్రాంతంలోని ప్రతి పట్టణంలోను, ప్రతి బస్తీలోను వారు నిర్వహించారు. వారికి అవసరమైన ఆహారము, వైద్య సహాయము, దుస్తులు, రక్షణ సమకూర్చారు.వివిధ పట్టణాలలోఅగ్నిమాపకదళాలుగా కూడ ఏర్పడ్డారు. లారీలు, బస్సులద్వారా ప్రయాణవసతి కల్పించారు. వలసపోతున్న హిందువులను, సిక్కులను తీసికొని పోయే రైళ్ళలో భద్రత కల్పించారు. హిందూ, ...క్కులున్న ప్రదేశాలలో రాత్రింబవళ్ళు కాపలా కాస్తూ, దాడి జరిగితే ఆత్మరక్షణ ...సుకునే విధానాలు కూడ నేర్పారు. ఈ యువకులు భయగ్రస్తులైన హిందూ, ...క్కుల పరిరక్షణ కోసం అందరి కంటె ముందు వచ్చి తూర్పు పంజాబ్‌లోని ...రక్షిత స్థలాలకు అందరినీ చేర్చిన తరువాతనే చివరగా తాము కూడ వెళ్ళారు. ...ంజాబ్‌లోని వివిధ జిల్లాలలో తమకు, తమ కుటుంబాలకు రక్షణ కల్పించవల

సిందిగా ఆర్. యస్. యస్.ను బహిరంగంగా వేడుకున్న ఎందరో ప్రఖ్యాత కాంగ్రెసు నాయకుల పేర్లు నేను చెప్పగలను. ఎవరు ఎక్కడ సహాయం కోసం అర్థించినా తిరస్కరించడం జరగలేదు. పైగా హిందూ మొహల్లాలలోని ముస్లిం స్త్రీలను, పిల్లలను సురక్షితంగా ఆర్. యస్. యస్. కార్యకర్తలే తరలించి లాహోర్‌లో ముస్లింలీగువారి శరణాలయాలకు చేర్చిన సంఘటనలు కూడ నా దృష్టికి వచ్చాయి." దికల

"పంజాబ్ మొత్తం దగ్ధమవుతుండగా, కాంగ్రెసు నాయకులు ఢిల్లీలో కృ హాయులై తిరుగుతూ ఉంటే, ఆర్. యస్. యస్.వారి క్రమశిక్షణ, వారి గిలిం సామర్థ్యము, ప్రమాద పరిస్థితిలో సహితం వారు కనబరిచిన నిస్వార్థత పటావ: ప్రజలను రక్షించాయి. పంజాబ్‌లోని సిక్కులను ఆర్. యస్. యస్. వీరులను వ్యతిరేకించమని పంజాబ్‌వారికి ఇప్పుడు ఇతర ప్రాంతాలవారెవరైనా సలహా యిస్తే ఆ సలహాను ఎవరూ పాటించరు."

శ్రీ ఖాలి చివరకు యిలా అంటారు; "పశ్చిమ పాకిస్తాను నుంచి వచ్చిన శరణార్థులు ప్రతి ఒక్కరూ– వారు భారతదేశంలో ఎక్కడ నివసిస్తున్నా సరే– ఆనాడు తమ గోడు వేరెవరూ వినని పరిస్థితిలో తమను రక్షించిన ఆర్. యస్. యస్.కు కృతజ్ఞతాబద్ధులై వున్నారు".

ఆ రోజుల్లో పంజాబ్‌లో హింసాకాండకు గురియైన ప్రజలకు బాసటగానిలిచిన ఏకైక అఖిల భారత నాయకుడు శ్రీ గురూజీ. ప్రమాదభరిత పరిస్థితులలో ఆయన స్వయంగా ప్రదర్శించిన నిర్భీకత, ప్రజల పట్ల ఆయనకున్న అపారమైన శ్రద్ధ, తనకు జరుగగల హానికి సైతం తెగించి కల్లోల ప్రాంతాలలో ఆయన జరిపిన ఎడతెగని పర్యటన– వీటి నుండి స్ఫూర్తి పొంది వేలాది సంఘ కార్యకర్తలు కష్టాలలో చిక్కుకున్న మానవాళికి సంరక్షణ; సహాయము అందించేందుకై ఉద్యమించారు. స్ఫూర్తిదాయకమైన అట్టి ఆదర్శమూర్తి తమ కన్నెదుట వుండగా సంఘ కార్యకర్తలు తమ బాధ్యతలు నిర్వర్తించడంలో ఎట్టి కష్టనష్టాలకు చలించలేదంటే ఆశ్చర్యమేముంది? నిజానికి వందలాదిమంది కార్యకర్తలు తోటిసోదరసోదరీమణుల మానప్రాణాలను సంరక్షించే కార్యంలో తమ జీవితాలనే ఆనందంగా సమర్పించారు కూడా.

## కాశ్మీర్ రక్షణలో :

దేశవిభజన జరిగిన కొద్ది కాలానికే పాకిస్తాన్ కుటిల దృష్టి కాశ్మీర్‌పై పడింది. భారత్‌లో చేరాలా, పాకిస్తాన్‌లో చేరాలా లేక స్వతంత్రంగా వుండిపోవాలా అని నిర్ణయించుకోలేక ఎటూ తోచని స్థితిలో మహారాజు వున్నారు. మహారాజు మనస్తత్వ మెరిగిన సర్దార్ పటేల్ ఆయనతో మాట్లాడవలసిందిగా శ్రీ గురూజీని కోరారు. 1947 అక్టోబరు 17న శ్రీ గురూజీ విమానంలో శ్రీనగర్ చేరారు. కాశ్మీరును స్వతంత్ర రాజ్యంగా వుంచాలని ఆలోచించడం ఎంత నిష్ప్రయోజనమో ఆయన మహారాజుకు నచ్చజెప్పారు. పాకిస్తాన్ దానిని సహించదు. ఆంతరంగికంగా ముస్లింలు తిరుగుబాటు చేయడానికి, సైన్యంలోని ముస్లింలు ప్రభుత్వాన్ని మోసగించేటట్లు చేయడానికి కూడ పాకిస్తాను కుట్ర పన్నుతుంది. కాశ్మీరులోని అన్ని వర్గాల ప్రజల ప్రయోజనాలను పటేల్ కాపాడుతారని కూడ శ్రీ గురూజీ హామీ యిచ్చారు. చివరకు మహారాజు కాశ్మీరును భారత్‌లో కలిపే ఒప్పందం మీద సంతకం పెట్టడానికి సంసిద్ధత వ్యక్తం చేశారు. అక్టోబరు 19న శ్రీ గురూజీ ఢిల్లీ వచ్చి భారత్‌లో చేరడానికి మహారాజు వ్యక్తం చేసిన సంసిద్ధత గురించి పటేలుకు వివరించారు.

1971 పాకిస్తాన్ యుద్ధం సమయంలో లూధియానాలో
సంఘం సైనిక సహాయ కేంద్రాలు నడిపింది.



అయితే పాకిస్తాన్ కుట్ర ఫలితంగా, స్థానిక బ్రిటిషు కమాండర్ల ప్రోత్సాహంతో 1947 అక్టోబరు 23న కాశ్మీరుపై అకస్మాత్తుగా పెద్ద యెత్తున దాడి జరగడంవల్ల ఆ కీలక ప్రాంతం యొక్క భద్రత అత్యంత విషమస్థితికి చేరుకుంది. ఇక మహారాజు తాత్సారం చేయకుండా భారత్‌లో కలిపేసి సహాయమర్థించాడు. అయితే విమానాలలో సైన్యాన్ని పంపడానికి భారత ప్రభుత్వం నిర్ణయించినతరువాత కూడ శ్రీ నగర్‌లోని విమానాశ్రయం పరిస్థితి దారుణంగా వుంది. విమానాశ్రయం మంచుతో నిండి వుండటాన ఎందుకూ పనికి రాకుండా వుంది. శ్రీనగర్‌లో పరిస్థితులు ఎంత గందరగోళంగా వున్నాయంటే మహారాజు, షేక్ అబ్దుల్లా సహితం తల దాచుకొనడానికి జమ్మూ వెళ్ళారు.

కాని సంఘ స్వయంసేవకులు హుటాహుటిన అక్కడకు చేరుకొని, రాత్రింబవళ్ళు పని చేసి మంచునంతటిని తొలగించి సరియైన సమయానికి భారత విమానాలు దిగడానికి తోడ్పడ్డారు. దురాక్రమణకారులను భారత జవానులు త్రిప్పి కొడ్తున్న రోజుల్లో కూడ స్వయంసేవకులు సాహసోపేతమైన సహాయ సహకారాలు అందించారు. ఒక సందర్భంలో మన జవాన్ల కోసం భారత విమానాల ద్వారా పడవేయబడిన మందుగుండు సామగ్రి పెట్టెలు పాకిస్తానీల ఫైరింగు రేంజికి దగ్గరలోపడినవి. శత్రువుల కాల్పులకు వెరువకుండా స్వయంసేవకులు ఎలాగో అక్కడకు చేరుకొని ఆ పెట్టెలను మన జవాన్లకు చేర్చారు. మధోపూర్ వద్ద రావీనదిని దాటేటప్పుడు మందుగుండు సామగ్రి తడువకుండా ఉండేందుకు తమ వీపుకు తగిలించుకొని మోశారు. మరి కొన్నిచోట్ల-పాకిస్తానీలు పెట్టిన అవరోధాలను తొలగించడంలో కూడ వారు జవాన్లకు సహాయం చేశారు.

## భారత పరిరక్షణలో :

రాజధాని నడిబొడ్డున సహితం తీవ్రమైన ప్రమాదకర పరిస్థితి రాజుకుంటున్నది. ఈ సందర్భంగా స్వయంసేవకులు చేసిన కృషిని మహావిద్వాంసుడు, మహర్షి అయిన భారతరత్న డా॥ భగవాన్‌దాస్ యిలా ప్రస్తుతించారు "1947 సెప్టెంబరు 10న లీగువారు జరుప తలపెట్టిన 'తిరుగుబాటు' గురించి ఉన్నతభావప్రేరితులు, ఆత్మ త్యాగసన్నద్ధులు అయిన ఆర్. యస్. యస్. వారు సరియైన సమయంలో కనిపెట్టి సర్దార్ పటేలుకు, నెహ్రూజీకి తెలియజేశారు. ఆ 'తిరుగుబాటు' ద్వారా భారత ప్రభుత్వంలోని అందరు నాయకులను, హిందూ అధికారులను, వేలాదిమంది హిందూ పౌరులను ఆ రోజు హతమార్చి ఎర్రకోటమీద 'పాకిస్తాన్' జండా ఎగుర

వేయాలని ఆపై హిందూదేశాన్నంతటిని స్వాధీనపరచుకోవాలని కుట్ర పన్నడం జరిగింది" అంటూ డా॥ భగవాన్ దాస్ "దేశభక్తి ప్రపూరితులైన లక్షలాది మంది ఆర్. యస్. యస్. యువకుల శక్తియుక్తులను వినియోగించుకోండి కాని అణచజూడవద్దు" అని ప్రభుత్వానికి సలహా యిచ్చారు.

## 'వయం పంచాధికం శతం'

దేశం స్వతంత్రం పొంది, మనవారే అధికారాన్ని చేపట్టారు. వెంటనే శ్రీ గురూజీ 1947 సెప్టెంబరులో పండిత నెహ్రూ, సర్దార్ పటేల్‌లను కలుసుకొని ప్రభుత్వానికి ఆ గడ్డుదినాల్లో సంఘం యొక్క మద్దతు వుంటుందని తెలియజేశారు. సామరస్యంతో సందేహానికి ఆస్కారం లేని సంపూర్ణమైన సహకారాన్ని ప్రభుత్వానికి అందిస్తామని శ్రీ గురూజీ బహిరంగంగా ప్రకటించారు కూడాను. 1948 జనవరి 9న మకర సంక్రాంతి ఉత్సవ సందర్భంగా బొంబాయిలోని శివాజీపార్కులో జరిగిన బ్రహ్మాండమైన సార్వజనికోత్సవంలో ప్రసంగిస్తూ "మన దేశం ఒక యుగ సంధిలో వుంది. బానిసత్వపు కరాళ రాత్రి గడిచిపోయింది. అధికారంలోకి వచ్చిన మన నాయకులు క్రొత్త బాధ్యతలభారాన్ని వహిస్తున్నారు. ఇది వారికి క్రొత్తగనుక కొన్ని పొరపాట్లు చేసినా చేయవచ్చు. అయితే వారు మన వారేనని మనం గుర్తుంచుకోవాలి. మనం వైషమ్యాలకు, పట్టుదలలకు లోనుకాకూడదు. మన ఆలోచనలకు, చేతలకు యుధిష్ఠిరుని సమున్నతాదర్శం ప్రేరణగా నిలవాలి. పాండవులను అవమానించాలనే పట్టుదలతో వచ్చిన కౌరవులు తామే గంధర్వులకు పట్టుబడినప్పుడు కౌరవులను రక్షించవలసిందిగా అర్జునుని ఆదేశిస్తూ యుధిష్ఠిరుడు "మనం అయిదుగురం. వారు వందమంది కావచ్చు. అయితే శత్రువులకు మాత్రం మనం నూటయిదు మందిమి– వయం పంచాధికం శతం" అన్నాడని శ్రీ గురూజీ గుర్తు చేశారు.

## 'సంఘం వృద్ధి చెందుతుంది' : గాంధీజీ

దేశవిభజన జరిగిన వెంటనే 1947 సెప్టెంబరులో గాంధీజీ శ్రీ గురూజీని కలుసుకొనగోరారు. సంఘశక్తి దినదిన ప్రవర్ధమానమవుతున్న విషయమేగాక సంఘం యొక్క దేశభక్తి భావన గురించి కూడ గాంధీజీకి బాగా తెలుసు. అంతకు పూర్వం 1946లో గాంధీజీ భంగీ కాలనీలో నివసిస్తున్నపుడు ఒక రాత్రి పెద్ద సంఖ్యలో ముస్లిం గూండాలు వచ్చి ఆ ప్రదేశాన్ని చుట్టుముట్టి గాంధీజీని అనరాని

మాటలతో దూషించారు. అప్పటినుండి స్వయంసేవకులు చాలా వారాలపాటు రాత్రిళ్ళు గాంధీజీ నివాసానికి కాపలా కాశారు.

గాంధీజీ కోరిక తెలిపిన వెంటనే శ్రీ గురూజీ ఢిల్లీ వచ్చి బిర్లా భవనంలో ఆయనను కలుసుకున్నారు. తరువాత శాంతి కోసం గాంధీజీ ప్రజలకు చేసినవిజ్ఞప్తిలో గురూజీతో తాను జరిపిన సమావేశం గురించి ప్రస్తావించారు. సంఘ కార్యకర్తలతో తాను మాట్లాడగోరుతున్నానని కూడ గాంధీజీ గురూజీతో చెప్పారు. ఆ ప్రకారమే 1947 సెప్టెంబరు 16న భంగీ కాలనీ సమీపంలో దాదాపు 500 మంది సంఘ కార్యకర్తల నుద్దేశించి గాంధీజీ ప్రసంగించారు. ఆయన ప్రసంగంలోని భాగాలను 'హిందూ' పత్రిక మరునాడు ప్రకటించింది: "ఆయన(గాంధీజీ) కొన్ని సంవత్సరాల క్రిందట సంఘ స్థాపకుడు డా॥ హెడ్గెవార్ జీవించివున్న రోజులలో ఆర్. యస్. యస్. శిబిరాన్ని సందర్శించారు. వారి క్రమశిక్షణ, అస్పృశ్యతారాహిత్యం, కఠోర నిరాడంబరతలకు ఆయనెంతో ముగ్ధులైనారు. ఆ తరువాత సంఘమెంతగానో విస్తరించింది. సేవ, ఆత్మ సమర్పణ వంటి ఉన్నతాదర్శాల చేత ప్రేరేపించబడిన ఏ సంస్థ అయినా శక్తి పుంజుకొనితీరుతుందని మహాత్మాగాంధి దృఢవిశ్వాసం వ్యక్తం చేశారు."

## సంఘ వ్యతిరేకులకు పటేల్ హెచ్చరిక :

కాని కాంగ్రెసు వారికి మాత్రం సంఘశక్తి పెరిగిపోతుండటంచూచి క్రమంగా 'సంఘభీతి' పట్టుకుంది. సంఘంవల్ల తమ అధికారానికి ఏదయినా ప్రమాదం వస్తుందేమోనని వారు భయపడసాగారు. అయితే సంఘం పదవులు సంపదలుకోరే తుచ్ఛమైన ఆలోచనలకు అతీతంగా తాను నిర్ణయించుకున్న లక్ష్యసాధనకు మాత్రమే దృఢంగా కట్టుబడి వుంది.

సంఘాన్ని జాతికి శక్తికేంద్రంగా భావించే స్వస్థచిత్తులు కూడ కాంగ్రెసు నాయకులలో లేకపోలేదు. 1948 జనవరి 6న సర్దార్ పటేల్ లక్నో నుంచి ఆకాశవాణిలో చేసిన ప్రసంగం కాంగ్రెసులోని 'సంఘ' వ్యతిరేకవర్గానికి ఒక విధంగా హెచ్చరికగా భావించవచ్చు: "పదవులు చేపట్టిన కాంగ్రెసువారు తమ అధికారంతో ఆర్. యస్. యస్.ను అణచగలమనుకుంటున్నారు. బలప్రయోగంతో ఒక సంస్థను మీరు అణచలేరు. బలప్రయోగం చేయవలసినది దొంగల మీద, బందిపోట్లమీద. ఆర్. యస్. యస్. వారు దొంగలు, బందిపోట్లు కారు; దేశాన్ని ప్రేమిస్తున్న దేశభక్తులు" అన్నారు పటేల్.

అయితే కాంగ్రెసులోని 'సంఘ' వ్యతిరేకులు కుట్రలు చేస్తూనే వచ్చారు. నిజానికి ముఖ్యమంత్రులు, కేంద్ర దేశీయాంగ మంత్రి 1947 నవంబరులో జరిపిన సమావేశంలో యీ అంశం ప్రస్తావనకు వచ్చింది. "ఒక సంస్థగా సంఘం మీద చర్య తీసుకోవలసిన దశ అప్పటికి (1947 సమావేశం నాటికి) యింకా రాలేదని అప్పట్లో ఏకగ్రీవంగా ఆమోదించడం జరిగింది," అని 1948 ఫిబ్రవరి 4న సంఘాన్ని నిషేధిస్తూ జారీ చేసిన ప్రకటనలో ప్రభుత్వం ఒప్పుకుంది. అయితే సంఘాన్ని అణచివేయడానికి ఎంతగానో ఎదురుచూస్తున్న కాంగ్రెసుకు గాంధీజీ దారుణ హత్యవల్ల సువర్ణావకాశం లభించింది.

## సంఘంపై నింద తొలగించిన పటేల్:

ఈ ఘోర దుర్వార్త విన్న వెంటనే మద్రాస్‌లో వున్న శ్రీ గురూజీ అన్ని కార్యక్రమాలను రద్దు చేసుకొని విమానంలో నాగపూర్ చేరుకున్నారు. ఒక పత్రికా ప్రకటన చేస్తూ ఆ దారుణ హత్యను ఖండించి స్వర్గీయ మహాత్మునికి అశ్రుపూరిత శ్రద్ధాంజలి ఘటించారు. నెహ్రూ, పటేల్‌లకు వ్రాసిన లేఖలలో వారిరువురు యీ కల్లోలిత జలాలలో దేశనౌకను సురక్షితంగా నడపడంలో కృతకృత్యులు కావాలనే ఆకాంక్ష కూడ వ్యక్తం చేశారు. అయితే ఆయన వ్యక్తం చేసిన ఉదాత్త భావాలకు అనుగుణ్యంగా ప్రభుత్వం స్పందించలేకపోయింది. ప్రభుత్వం సంఘాన్ని నిషేధించింది. గాంధీజీ హత్యకు కుట్ర వన్నారనే ఆరోపణ మీద శ్రీ గురూజీతోపహా 17 వేలమంది సంఘ కార్యకర్తలను నిర్భంధించింది. ప్రభుత్వంతో సంఘర్షణ ఏర్పడ కుండా, ప్రశాంత వాతావరణంలో ప్రభుత్వం తన తప్పిదం తెలుసుకొని సరిదిద్దుకొన డానికి అవసరమైన కాలవ్యవధి యివ్వడానికి శ్రీ గురూజీ సంఘాన్ని రద్దు చేశారు.

కాంగ్రెసువారు, సోషలిస్టులు, కమ్యూనిష్టులు– ప్రత్యేకించి మహారాష్ట్రలో సంఘ స్వయంసేవకులను, సానుభూతిపరులను చంపడానికి, లూటీ చేయడానికి ప్రజలను రెచ్చగొట్టారు. గాంధీజీ హత్యానేరంలో సంఘానికి ఏదో సంబంధమున్నదని చేసిన ఆరోపణ వట్టి కట్టుకథ అనే విషయం మొదటి నుంచి స్పష్టంగా తెలుస్తూనే వుంది. హత్య జరిగిన నెలరోజుల లోపుగానే– 1948 ఫిబ్రవరి 26నాడే సర్దార్ పటేల్ నెహ్రూకు వ్రాసిన లేఖలో "బాపూ హత్య కేసుకు సంబంధించిన నేర విచా రణలో ప్రగతిని ఏ రోజుకారోజు నేను స్వయంగా తెలుసుకుంటున్నాను. ముఖ్యులైన దోషులంతా తమ కార్యకలాపాలకు సంబంధించి సుదీర్ఘమైన సవివరమైన ప్రకటనలు

యిచ్చారు. వీటిని పరిశీలిస్తే ఆర్. యస్. యస్.కు దీనితో ఎటువంటి సంబంధమూ లేదని స్పష్టంగా అర్థమవుతున్నది" అని వ్రాశారు.

## న్యాయం కోసం పోరాటం :

ఆరు నెలల నిర్బంధం తరువాత శ్రీ గురూజీ విడుదలైనారు. సంఘంపై విధించబడిన నిషేధం పూర్తిగా అక్రమమని, అనవసరమని బాగా తెలిసినప్పటికీ ఆయన ప్రభుత్వాధినేతలకు మృదువుగా నచ్చజెప్పి న్యాయం కలుగజేయమని మనవి చేశారు. ఎంతగా రెచ్చగొట్టజూచినా ఆయన అత్యంత నిగ్రహంతో వ్యవహరించారు. బ్రిటీషువారు వెళ్ళిపోయిన యీ సందర్భంలో జాతిలో అంతఃకలహాలు చెలరేగితే దీనివల్ల శత్రువులు ప్రయోజనం పొందుతారు. అట్టి పరిస్థితిని నివారించే దృష్టితోనే ఆయన అన్ని అవమానాలను మౌనంగా భరించారు. కాని ప్రభుత్వం దీనినంతటిని బలహీనతగా భావించి ఆయన చేసిన విజ్ఞప్తిని పెడచెవిని పెట్టింది. ప్రత్యామ్నాయ మార్గం లేని పరిస్థితిలో శ్రీ గురూజీ తిరిగి శాఖా కార్యక్రమాలను ప్రారంభించవలసిందిగా స్వయంసేవకులకు పిలుపు యిచ్చారు. జాతీయ జీవనంలో నీతిని, న్యాయాన్ని నెలకొల్పే లక్ష్యం కోసం కష్టనష్టాలకు త్యాగాలకు సిద్ధపరిచే పిలుపు అది. అప్పుడు జరిగిన సత్యాగ్రహంలో 14 సం॥ నుండి 75 సం॥ వరకు వయోవైవిధ్యత గల 60, 000 మంది పైగా స్వయంసేవకులు బందీ అయినారు. ఈ సంఖ్య గతంలో 1921, 1930–32, 1942లలో కాంగ్రెసు నిర్వహించిన ఏ సత్యాగ్రహంతో పోల్చిన కూడ ఎక్కువే. చలికాలపు రోజులవి. జైళ్ళు చాలీచాలకుండా వున్నాయి. అయినప్పటికీ స్వయంసేవకులు ఆ ఇబ్బందులన్నింటినీ హుందాగా, సంయమనంతో ఎదుర్కొన్నారు. కేవలం సంఖ్యాబలంలోనే కాదు, సత్యాగ్రహపు యదార్థ భావన బట్టి చూచినా యీ ఉద్యమం అసాధారణం, అనదృశమైనది. పోలీసులు తమ నెంత పాశవికంగా హింసించినా స్వయంసేవకులు హింసకు పూనుకున్న సందర్భంగాని, అనుచితంగా ప్రవర్తించిన సందర్భంగాని మచ్చుకైనా లేదు.

## లిబరల్ నాయకుని మధ్యవర్తి తీర్పు :

సంఘం దాదాపుగా అణచివేయబడినట్లే అని యింతవరకు భావించిన ప్రభుత్వం తన దురాగతం ప్రజలు పసికట్టారని తెలుసుకున్నది. సంఘం మీద నిషేధం తొల

గించే విషయమై ప్రభుత్వం ఇండియన్ లిబరల్ ఫెడరేషన్ అధ్యక్షుడైన శ్రీ టి. ఆర్. వి. శాస్త్రి ద్వారా చర్చలు ప్రారంభించింది. అయితే ప్రభుత్వం అవలం బిస్తున్న డొంక తిరుగుడు వైఖరి, అసమంజసమైన కుతర్కాలు, సంఘం మీద మోపదలచుకున్న షరతులు— యివన్నీ చూచి నిష్పక్షపాతి అయిన ఆ లిబరల్ నాయకుడికి సహితం రోత కలిగింది. చివరకు ఆయన తన అభిప్రాయాన్ని పత్రిక లకు పంపి 1949 జులై 13లోగా ప్రకటించవద్దని సూచించారు. చక్కగా సహేతు కంగా తయారు చేసిన ఆ ప్రకటనలో ఆయన ప్రభుత్వ వైఖరి అసంబద్ధమైనదని, పస లేదని స్పష్టంగా విశదీకరించారు: "వెర్రి తలలు వేస్తున్న మతోన్మాదం నడుమ జీవిస్తున్న నాకు— ఈ ముక్కలు చెక్కలైన హిందూ సమాజాన్ని సమైక్యపరచ డానికి ఆర్. యస్. యస్. చేస్తున్న ప్రయత్నం ఎంతో మంచి పని అనిపిస్తున్నది. ఇంతేగాక మన కళ్ళ యెదుటనే తాండవిస్తూ ప్రభుత్వాన్ని సైతం చికాకు పెడుతున్న యితర దోషాలను ఎదుర్కొనడంలో కూడ అది ప్రయోజనకారి కావచ్చును."

"నేను ఈ క్రింది వాస్తవాలను పరిగణనలోకి తీసుకొని, పై నిర్ణయానికి వచ్చాను: ఏమంటే ఆర్. యస్. యస్. వారు ఇరవై సంవత్సరాలకు పైగా పూర్వ ప్రభుత్వ పాలనలో బహిరంగంగా ఎట్టి అభ్యంతరాలకు తావు లేకుండా పని చేశారు. పేరొందిన ప్రజానాయకులు వారితో కలిసి పని చేయడమో వారి విశేష కార్య క్రమాలలో పాల్గొనడమో జరిగింది; ప్రభుత్వోద్యోగులు కూడ ఎట్టి ఆక్షేపణ లేకుండ వారి కార్యక్రమాల్లో పాలుపంచుకున్నారు; గాంధీజీ హత్య చేయబడేవరకు మన ప్రభుత్వానికి కూడ వారిపై చర్య తీసుకొనడానికి ఎట్టి కారణం కనిపించలేదు. గాంధీజీ హత్యతో వారికి ప్రమేయం వున్నదని మరికొందరిపై అట్టి దారుణానికి తల పడవచ్చునని ప్రభుత్వం అనుమానించింది. అయితే ఎట్టి ఆధారం లేకుండానే ఆ అనుమానం వ్యక్తం చేయబడిందని యిప్పుడు ధృవపడింది. నిషేధాన్ని తొలగించి, యిటీవలి యిబ్బందులు తల యెత్తేవరకు రెండు దశాబ్దాలు పైగా గతంలో ఆ సంస్థ ఎలా పని చేసిందో అలాగే తిరిగి పనిచేసుకోనిస్తే అందువల్ల ప్రభుత్వానికి గాని, ప్రజాభద్రతకుగాని ఏదైనా ప్రమాదం జరగవచ్చునని అనుమానించడానికి ఎట్టి ఆస్కారం లేదని నేను భావిస్తున్నాను" ప్రభుత్వం ఎలాగయినా నిషేధాన్ని తొలగించి పూర్వంవలెనే ఆర్. యస్. యస్.ను పనిచేసుకోనిస్తుందనే ఆశాభావాన్ని శ్రీ శాస్త్రి వ్యక్తం చేస్తూ "నిషేధాన్ని యింకా కొనసాగించడం, ప్రముఖ వ్యక్తుల నందరిని జైళ్ళలో నిర్బంధించి వుంచడం న్యాయం కాదు, శ్రేయస్కరమూ కాదు, అవసరమూ లేదు అని నా అభిప్రాయం" అన్నారు.

అప్పటికే సత్యాగ్రహం వల్ల కొంత ప్రజావిశ్వాసం కోల్పోయిన ప్రభుత్వం, ఈ ప్రకటన ప్రజల దృష్టిలో పడితే మిగిలిన పరువు సైతం దక్కదనిగ్రహించింది. శ్రీ శాస్త్రి యిచ్చిన ప్రకటన ప్రజల దృష్టిలో పడనీయకూడదనే ఉద్దేశంతో హడావిడిగా 1949 జులై 12న నిషేధాన్ని ఎత్తివేసింది. అయినా అదేమి అదృష్టమో కొన్ని పత్రికలలో శాస్త్రిగారి ప్రకటన కూడ ప్రభుత్వ ఉత్తరువుతోపాటు ప్రకటించబడింది.

## ఇనుమడించిన సంఘ ప్రతిష్ఠ :

నిషేధం తొలగించిన పిమ్మట దేశవ్యాప్తంగా శ్రీ గురూజీ జరిపిన తొలి పర్యటనలో వారికి యివ్వబడిన అపూర్వ స్వాగతాన్నిబట్టి చూస్తే అంతవరకు

దేశమంతటా గురూజీకి అఖండ స్వాగతం!



సంఘానికి వ్యతిరేకంగా సాగించబడిన దుష్ప్రచారాన్ని ప్రజానీకం పట్టించుకోనేలేదని ఋజువయింది. పైగా యీ అగ్నిపరీక్ష సంఘం యొక్క ప్రతిష్ఠను యినుమడింప జేసింది. ఆఖరికి బి. బి. సి. సైతం "భారతదేశంలో నేడు నెహ్రూ, గోళ్వాల్కర్‌లు ఇద్దరు మాత్రమే బ్రహ్మాండమైన ప్రజాసమూహాలను ఆకర్షించగలరు....గోళ్వాల్కర్ యొక్క రాజనైతిక ప్రాముఖ్యతనుగాని, ఆయన సంస్థకు గల శక్తినిగాని భారత దేశంలో నేడు ఎవరూ తక్కువగా అంచనా వేయరు"అని వ్యాఖ్యానించింది.

శ్రీ కె. యం. మున్షీ ఒక ప్రత్యేకమైన వ్యాసంలో- "ఆర్. యస్. యస్. అధినేత శ్రీ గురూజీ యావద్భారతం పర్యటిస్తున్నారు. ఈ సందర్భంగా ఉదాహ రణకు ఢిల్లీలో వారికి యివ్వబడిన స్వాగతం ఎలాంటిదో గమనిస్తే ఆర్. యస్. యస్. బాగా వ్రేళ్లూనుకున్నదని అర్థమవుతుంది. ఈ వాస్తవాన్ని నిర్లక్ష్యం చేసి లాభం లేదు" అన్నారు.

1949 నవంబరు 20న డా॥ జకీర్ హుస్సేన్ మోంఘీర్‌లో మిలాద్ మొహ ఫిల్‌లో ప్రసంగిస్తూ "ముస్లింల పట్ల ఆర్. యస్. యస్. హింసను, విద్వేషాన్ని ప్రేరేపిస్తున్నదని కొందరు చేసిన ఆరోపణలు పూర్తిగా అబద్ధాలు. పరస్పర ప్రేమ. సహకారం, సంఘటనల పాఠాన్ని ఆర్. యస్. యస్. నుంచి ముస్లింలు నేర్చుకోవాలి" అన్నారు.

ఒరిస్సా అసెంబ్లీ మాజీ స్పీకరు శ్రీ నీలకంఠదాస్ మాట్లాడుతూ "జగన్నాథ దేవాలయాన్ని ముస్లింలు ఒకనాడు విధ్వంసం చేయబూనుకోగా నాగపూర్‌కు చెందిన భోంస్లేలు వచ్చి ఆదుకున్నారు. నేడు మన ఆర్తనాదాలకు మరల నాగపూర్ నుంచే ప్రతిస్పందన వస్తున్నది. అయితే యీమారు ఒక్క ఉత్కళనే కాదు. మొత్తం భారతజాతినే ఆర్. యస్. యస్. రక్షించనున్నది." అన్నారు.

అయితే తాము ప్రభుత్వంవల్ల ఎన్ని బాధలు అనుభవించినా స్వయంసేవకుల మనసులో ఎట్టి ప్రతీకార వాంఛ కాని, విద్వేషంకాని తలయెత్తలేదు. "ఎంతయినా యీ ప్రభుత్వం మనదే కదా! మన నాలుక పంటి కింద పడి నలిగినంతమాత్రాన పళ్ళు రాలగొట్టుకోము" అని మాత్రమే శ్రీ గురూజీ అన్నారు.

## జాతి అంతరాత్మగా సంఘం :

తాత్కాలిక గ్రహణం నుంచి బయట పడటంతోనే సంఘ సూర్యుడు జాతీయ గగనతలాన మరింత ఉజ్వలంగా ప్రకాశించనారంభించాడు, జాతీయ ప్రయోజనాల

విషయంలో ప్రమాద స్థితిగాని రాజీపడే ధోరణిగాని కనిపించినపుడల్లా సంఘం ప్రజలను, ప్రభుత్వాన్ని ఎప్పటికప్పుడు హెచ్చరించడం మొదలుపెట్టింది. నేడు బంగ్లాదేశ్‌గా వున్న తూర్పు పాకిస్తాన్‌లోని హిందువుల భద్రతవిషయంలో ప్రభుత్వం తన బాధ్యతను తప్పించుకోరాదని కోరింది. పాకిస్తాన్‌కు బెరుబరీని ధారాదత్తం చేయడాన్ని తీవ్రంగా విమర్శించింది. సింధు జలాల ఒప్పందంవల్ల దేశప్రయోజనాలు ఎంతగానో దెబ్బ తింటాయని సంఘం ప్రకటించింది. మన జవాన్లు రక్తం ధారపోసి విముక్తం చేసిన హజీపీర్ కనుమను, యితర కీలక ప్రాంతాలను వదిలిపెట్టే షరతు వున్నందున తాష్కెంటు ఒప్పందం కూడా సంఘ విమర్శకు గురి అయింది. చైనా టిబెట్టును ఆక్రమించుకోనిస్తే భారత సరిహద్దులను కూడా ఆక్రమించుకోమని చైనాకు సూచించినట్లవుతుందని హెచ్చరించింది. కాశ్మీర్ సమస్యకు ఒకే ఒక పరిష్కారమున్నదని, కాశ్మీరుకు ప్రత్యేక ప్రతిపత్తిని యిచ్చే రాజ్యాంగంలోని 370వ అధికరణాన్ని రద్దు చేసి, పాక్ ఆక్రమణలో వున్న కాశ్మీరు ప్రాంతాలను తిరిగి సంపాదించడమే మార్గమని చెప్పింది.

శ్రీ గురూజీ అన్ని వేళలా జాతి నాడిని గమనిస్తూ, జాతిశ్రేయస్సుకై నిరంతరం ఆరాటపడుతూ— జాగృతమైన జాతీయ అంతరాత్మకు ప్రతీకగా నిలిచారు. కాశ్మీర్ సమస్య ఐక్యరాజ్య సమితికి నివేదించబడిన సమయంలో దాని వల్ల సమస్య ఎన్నటికీ పరిష్కారం కాదని, పైగా మన దేశప్రయోజనాలకు తీరని హాని కలుగుతుందని ఆయన బహిరంగంగా ప్రకటించారు. నాగాల తిరుగుబాటు యొక్క నిజస్వభావం గురించి ఆయన మొదటి నుంచే ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ వచ్చారు. 1953లో తన అస్సాం పర్యటన పూర్తి అయిన వెంటనే ఆయన పండిట్ నెహ్రూకు లేఖ వ్రాస్తూ అస్సాంలోకి తూర్పు పాకిస్తాను నుంచి ముస్లింలు రోజురోజుకు పెద్ద సంఖ్యలో చొరబడుతున్న విషయం తెలియజేశారు. చైనా దండయాత్ర గురించి ప్రభుత్వం వెల్లడించకముందే రానున్న ప్రమాదం గురించి ఆయన ప్రజలను హెచ్చరించారు. ఒక వంక పండిత నెహ్రూ, చౌ ఎన్‌లైలు హిందీ చీనీ భాయీభాయి నినాదంతో దేశమంతా తిరుగుతుండగా అదే సమయంలో శ్రీ గురూజీ ఆ తియ్యని నినాదం వెనుకనున్న మేకవన్నె పులి యొక్క అసలు స్వభావాన్ని రట్టు జేశారు. భాషాప్రయుక్త ప్రాంతాల నిర్మాణాన్ని గొప్ప చారిత్రక విశేష చర్యగా ప్రతి ఒక్కరు శ్లాఘిస్తూ వుండగా శ్రీ గురూజీ మాత్రం దానివల్ల భాషా దురభిమానానికి విభేదాలకు బీజం వేసినట్లవుతుందని ప్రమాదసూచన చేశారు. అలా ఆయన వెల్లడించిన ఎన్నెన్నో అభిప్రాయాలు ఆయన యొక్క దూరదృష్టిని నిరూపించి, దేశ వ్యవహారాల్లోని అవకతవకలను వెలుగులోకి తెచ్చాయి.

బ్రిటిషువారు నిష్క్రమించిన అనేక సంవత్సరాల తదుపరి కూడ పోర్చుగీసు వారి ఆధిపత్యంలోని స్థావరాలు మన సార్వభౌమత్వాన్ని సవాలు చేస్తూ నిలిచాయి. పోర్చుగీసుఆధిపత్యాన్ని తుదముట్టించాలని ప్రముఖసంఘకార్యకర్తలునిశ్చయించారు. ఒకే ఒక్క రోజు జరిపిన ఆకస్మిక చర్యతో దాద్రా, నగర హవేలీల సచివాలయం భవనంపై త్రివర్ణ పతాకం ఎగుర వేయడంతో అవి విముక్తమైనాయి. కాని, గోవా విముక్తి కోసం మాత్రం అన్ని పార్టీలు జాతీయ స్థాయిలో చాలకాలం పోరాడవలసి వచ్చింది. సత్యాగ్రహులకు ఇతర ప్రాంతాల నుంచి గోవా సరిహద్దుల వరకు వచ్చిన సందేశాలను అందించే పని పూర్తిగా స్వయంసేవకులే చూసుకున్నారు. ప్రముఖ సంఘ కార్యకర్తలు సత్యాగ్రహంలో పాల్గొని పోర్చుగీసు జైళ్ళల్లోదుర్భరమైన బాధలు అనుభవించారు. వారిలో ఒకరైన ఉజ్జయినికి చెందిన శ్రీ రాజాభావు మహంకాల్ పోర్చుగీసు వారి బుల్లెట్లకు నేలకు ఒరిగి— మన స్వాతంత్ర్య సమర యోధుల ధీరోచిత బలిదాన సాంప్రదాయాన్ని అనుసరించారు.

## సంతకాల సేకరణలో ప్రపంచ రికార్డు :

అవసరం వచ్చినపుడల్లా సంఘం దేశవ్యాప్తంగా బ్రహ్మాండమైన ప్రచారోద్యమాలను చేపట్టి ప్రతిసారి ఒక సరిక్రొత్త రికార్డును స్థాపిస్తూ వచ్చింది. స్వాతంత్ర్యోద్యమ కాలంలో మన జాతీయ నాయకులు యిచ్చిన ముఖ్యమైన హామీలలో ఒకటి గోవధను నిషేధించడం. మన రాజ్యాంగపు ఆదేశక సూత్రాల్లో కూడ యిది చేర్చబడింది. అయినా ప్రభుత్వం మాత్రం యీ విషయమై తటాపటాయిస్తూనే వుంది. ప్రజల నుంచి ప్రభుత్వం మీద ఒత్తిడి తేవాలని సంఘం నిశ్చయించింది. గొవు మన జాతికి ఒక శ్రద్ధాకేంద్రమని సంఘం విశదీకరించింది. గతంలో విదేశీయులు మన జాతి యొక్క గౌరవ మర్యాదలకు భంగం కలిగించి అవమానించే ఉద్దేశంతో గోవులను వధించడం ప్రారంభించారు. నేడు స్వరాజ్యం వచ్చిన తర్వాత అట్టి విదేశీ బానిసత్వపు చిహ్నాలను మాపుమాపవలసి వుంది. ఇట్టి జాతీయ దృష్టికోణంలో ప్రచార కార్యక్రమం చేపట్టబడింది. నెలరోజులపాటు సాగిన యీ బృహత్తర ప్రచారోద్యమంలో వేలాదిమంది స్వయంసేవకులు గ్రామగ్రామానికి యింటింటికీ వెళ్ళి గోవధపై తక్షణమే పూర్తి నిషేధాన్ని విధించాలని కోరుతూ దేశమంతటి నుంచి 1, 75, 39, 813 మంది వయోజనుల సంతకాలను సేకరించారు. ఒరిస్సా గవర్నరు, సుప్రీం కోర్టు మాజీ న్యాయమూర్తి అయిన శ్రీ ఫజల్ ఆలితో సహా లక్షలాదిమంది ముస్లింలు కూడ సంతకం చేయడంతో, ఇది ముస్లిం వ్యతిరేక



గోవధ నిషేధం కోరుతూ దాదాపు లక్ష గ్రామాల నుంచి సేకరించిన ప్రజాభిప్రాయా
రాష్ట్రపతికి వినపత్రంగా సమర్పించింది సంఘం.

కోరిక అనే ఆరోపణ అబద్ధమని కూడ ఋజువయింది. సంతకం చేసినవారి సం
నిజంగా ఒక ప్రపంచ రికార్డు!

## విపత్కాలాల్లో ప్రజాచైతన్య సమీకరణ :

1962, 1965, 1971 సంవత్సరాలలో మన పొరుగు శత్రురాజ్యాలు ద
చేసినపుడల్లా ప్రభుత్వ చర్యలకు, ప్రత్యేకించి జవాన్లకు అనుకూలంగా ప్రజ
మద్దతును సమీకరించడంలో సంఘం అగ్రభాగాన నిలిచింది. 1962లో చై
దండయాత్ర సందర్భంగా ప్రభుత్వానికి సంఘం యిచ్చిన హృదయపూర్వక స
కారాన్ని అభినందిస్తూ పండిత నెహ్రూ 1963 జనవరి 26న జరుగనున్న రిపబ్లిక్
పెరేడులో పాల్గొనవలసిందిగా సంఘాన్ని ప్రత్యేకంగా ఆహ్వానించారు. కేవల
మూడు రోజుల నోటీసుతో ఢిల్లీకి చెందిన 3500 మంది స్వయంసేవకులు పూ
యూనిఫారంతో వచ్చి పెరేడులో పాల్గొన్నారు. వారి పథసంచలనం ఆ కార



**1963 ఢిల్లీ రిపబ్లిక్ దినోత్సవంలో సంఘ స్వయంసేవకుల విన్యాసం**

క్రమంలో ప్రధానాంశం అయింది. వారితో వెనుక కదలిన అద్భుతమైన వాద్య బృందం మరింత వన్నె తెచ్చింది.

మరల 1965లో భారతదేశంపై పాకిస్తాను దండెత్తగా, నాటి ప్రధాని శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి స్వయంగా శ్రీ గురూజీకి ఫోను చేసి మరునాడు ఢిల్లీలో జరుగనున్న నాయకుల సమావేశంలో పాల్గొనటానికి రమ్మని విజ్ఞప్తి చేశారు. ఆ సమావేశంలో శ్రీ గురూజీ సంఘం తరఫున తమ సంపూర్ణ సహకారాన్ని ప్రకటించారు. కేవలం ఆత్మరక్షణ వైఖరిని అవలంబించే విధంగా భారత సైన్యానికి ఆదేశాలు యివ్వరాదని, సైన్యం తనకు యిష్టమైన రీతిలో ఎదురు దెబ్బ తీసే వ్యూహాన్ని తయారు చేసుకోనివ్వాలని కూడా ఆయన కోరారు. దేశవ్యాప్తంగా స్వయంసేవకులు విస్తారంగా రక్తదానం చేశారు. యుద్ధం జరిగిన మొత్తం 22 రోజులపాటు ఢిల్లీలో రాకపోకలను క్రమబద్ధం చేయడం వంటి పోలీసు విధులను స్వయంసేవకులకు యిచ్చి, పోలీసులు మరింత అత్యవసర విధులు నిర్వర్తించే వీలు కల్పించటం జరిగింది. సరిహద్దులకు పోతున్న జవాన్లకు పండ్లు అందించారు. యుద్ధం ముగిసిన పిమ్మట జనరల్ కుల్వంత్ సింగ్ ఒక సంఘ కార్యకర్తతో యిలా అన్నారు: "భారతదేశానికి పంజాబ్ రక్షణ హస్తం వంటిది, పంజాబ్‌కు ఆర్. యస్. యస్. రక్షణహస్తం"



పాకిస్థాన్ దాడి సమయంలో శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రితో శ్రీ గురూజీ

## మహనీయుల అభిప్రాయాలు :

సంఘ శాఖలను సందర్శించి సంఘ కార్యాన్ని ప్రశంసించే జాతీయ మహ నాయకులు ఎందరెందరో! జగద్గురువులైన శృంగేరి, పూరి, కంచి శంకరాచార్యులు పెజావరు, ఉడిపి మొదలైన ప్రధాన పీఠాలకు చెందిన ప్రముఖ ధర్మాచార్యులు స్వామి చిన్మయానంద, స్వామి రంగనాథానంద మొదలైన సాధువులు, సన్యాసులు సంతులు సంఘ ఉత్సవాలకు విచ్చేసి కార్యకర్తలను ఆశీర్వదించారు. సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తులుగా పనిచేసిన శ్రీ మెహర్‌చంద్ మహజన్, శ్రీ కోకా సుబ్బారావు, శ్రీ పతంజలి శాస్త్రి, ప్రఖ్యాతచరిత్రకారులైన డా॥ ఆర్. సి. మజుందార్ డా॥ రాధాకుముద్ ముఖర్జి, విఖ్యాత నాయకులైన డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్, భారతరత్న అన్నాసాహెబ్ కార్వే, బర్మాకు చెందిన ఊబాన్ ఘూన్, శ్రీ పురుషోత్తమదాస్ టాండన్, డా॥ సి. పి. రామస్వామి అయ్యర్, శ్రీ ఎన్. వి. గాడ్గిల్, సర్దార్ స్వరణ్‌సింగ్, శ్రీ ఎమ్. సి. చాగ్లా, శ్రీ నా ఫాల్కీవాలా, బుద్ధ మహాసభకు చెందిన శ్రీ రేవారాం జి. కవడే, శ్రీ గంగూర్దే

శ్రీ నరహర్ కురుంద్‌కర్, జనరల్ కరియప్ప, శ్రీ వి. పి. మీనన్, శ్రీ మన్నాత్ పద్మనాభన్, మాజీ లోక్‌సభ స్పీకరు శ్రీ కె. యస్. హెగ్డె, విద్వాంసులయిన పండిత సాత్వలేకర్, జ్ఞానపీఠ అవార్డులు పొందిన డా॥ డి. ఆర్. బెంద్రే, డా॥ కె. శివరామ కరంత్, డా॥ విశ్వనాథ సత్యనారాయణ యిత్యాది మహావ్యక్తులంతా సంఘ ఉత్సవాలకు అధ్యక్షత వహించి లేదా స్వయంసేవకుల నుద్దేశించి ప్రసంగించి తమ హృదయపూర్వక సహకారాన్ని ప్రకటించారు. వారిలో కొందరు ప్రముఖుల అభిప్రాయాలను పరిశీలిస్తే సంఘం యొక్క తీరుతెన్నుల గురించి విలువైన అంశా లెన్నో తెలుస్తాయి.

## భారత ప్రధాన న్యాయమూర్తి :

25-8-1968న బెంగుళూరు శాఖ గురుదక్షిణ ఉత్సవంలో శ్రీ కోకా సుబ్బారావు ప్రసంగిస్తూ "జాతీయ సమైక్యత యొక్క ప్రాముఖ్యాన్ని 1925లోనే, అనగా 43 యేండ్ల క్రిందటనే ఆర్. యస్. యస్. గుర్తించింది. సమైక్యత కోసం జాతీయ చైతన్యాన్ని సామరస్యాన్ని సృష్టించడమే నాకు అర్థమైనంతవరకు సంఘం యొక్క ప్రధాన లక్ష్యం. మానసిక, శారీరిక క్రమశిక్షణ, సంస్కారాల ద్వారా యీ లక్ష్యాలను సాధించాలని సంఘం ప్రయత్నిస్తున్నది. నేడు భారతదేశమంతటా ప్రతి యింటిలోను ఆర్. యస్. యస్. ఒక వాడుక పదమైంది. దేశానికి అది చేస్తున్న నిస్వార్థ సేవను ప్రతి ఒక్కరు గుర్తిస్తున్నారు" అన్నారు. శ్రీ సుబ్బారావు హిందూ సంస్కృతి, సెక్యులరిజంల గురించిన అపోహలను కూడ తొలగించి, ఆర్. యస్. యస్. ఆదర్శాలు సెక్యులరిజం సిద్ధాంతానికి వ్యతిరేకమనే విమర్శ పూర్తిగా అర్థ రహితమని ప్రకటించారు.

## సర్వసైన్యాధిపతి :

జనరల్ కరియప్ప 1959లో మంగుళూరు సంఘ కార్యక్రమంలో మాట్లాడుతూ "ఆర్. యస్. యస్. చేస్తున్న పని నా హృదయాంతరాళంలోని ఆకాంక్షను నెర వేర్చడమే" అన్నారు. "ముస్లింలు తమ యిస్లాంను, క్రైస్తవులు తమ క్రైస్తవాన్ని కీర్తిస్తుండగా హిందూ ధర్మాన్ని ఆర్. యస్. యస్. కీర్తిస్తే తప్పేమిటి?" అని ఆయన ప్రశ్నించారు. "ప్రియమైన యువకులారా! స్వార్థపరులైన వ్యక్తుల కుటిల విమర్శలకు చలించకండి. ఈ మహాసంఘటనను స్థాపించిన డా॥ హెడ్గేవార్ మాతృ

భూమి సేవలో నిస్వార్ధ భక్తికి సముజ్వల ఆదర్శంగా తన జీవితాన్ని వి
ముందుంచారు. ముందుకు చూడండి! ముందుకు పదండి! దేశం మీ సేవలను కో
తోంది" అని ప్రబోధించారు.

## చరిత్రకారుడు :

భారతీయ చరిత్రకారులలో అగ్రగణ్యుడు డా॥ ఆర్. సి. మజుందార్ క
కత్తాలో 1960లో జరిగిన సంఘ హేమంత శిబిరంలో ప్రసంగిస్తూ "రాష్ట్రీం
స్వయం సేవక సంఘం యొక్క కార్యక్రమాలు, కార్యకలాపాలనన్నింటిని సంశ
సంస్థాపకులైన స్వర్గీయ డా॥ హెడ్గెవార్ ఉన్నతమైన ఆదర్శంతో దూరదృష్టిత
యోజన చేశారు. ఆయన పట్ల నాకు అపారమైన భక్తిప్రపత్తులున్నాయి. అ
సుదూరదృష్టితో యదార్థ జాతీయ భావనను ప్రేరేపించే ఉద్దేశంతో, జాతిని శ
మంతము, సుసంఘటితము చేయడానికి ఆయన కార్య సమారంభం చేశారు. ఈ
దేశంలో హిందువులే నిజమైన జాతీయులనే సత్యాన్ని ధైర్యంగా ప్రకటించారు
చాలామంది యీ వాస్తవాన్ని అంగీకరించడానికి సిగ్గు పడతారు, యిది నిజమేన
తమ హృదయానికి తెలిసివున్నా. మన దేశం యొక్క గత వైభవం గురించి
మహత్తర సంస్కృతి గురించి ఎవరైనా మాట్లాడితే అది నిజంగా హిందూ చరిత్ర
హిందూ సంస్కృతి, హిందూ నాగరికత గురించి మాట్లాడటమే తప్ప వేరు కాద
మనం ధైర్యంగా, బాహాటంగా అంగీకరించాలి" అన్నారు.

## పరిపాలనా నిర్వాహకుడు :

పాకిస్తానులో భారతదేశపు తొలి హైకమీషనరుగా పని చేసిన శ్రీ శ్రీప్రకా
డెహ్రాడూన్ శాఖ గురుదక్షిణ ఉత్సవంలో తమ హృదయాంతర్గత భావాలను వె
డిస్తూ "మన దేశ స్వాతంత్ర్యాన్ని హరించివేయగల దుష్టశక్తులు మనచుట్టూ పొం
వున్నాయి. భాష, ప్రాంతం, వర్గం మొదలైన వివాదాల వల్ల కూడ దేశ
ముక్కలుగా చీలిపోయే ప్రమాదం వుంది. సంఘ స్వయంసేవకులైన మీరుమాత్ర
అఖండతను ఆకాంక్షిస్తున్నారు. దేశంలో సమైక్యతను నెలకొల్పడంలోను, దేశ
స్వాతంత్ర్యాన్ని సర్వదా పరిరక్షించడంలోను మీకు విజయం కలగాలని ఆశీర్వ
దిస్తున్నాను" అన్నారు.

## ముఖ్యమంత్రి :

హైకోర్టు న్యాయమూర్తిగాను, పంజాబ్ ముఖ్యమంత్రిగాను వున్న సర్దార్ గుర్నామ్‌సింగ్ 1963లో లూధియానా శాఖ గురుదక్షిణ ఉత్సవానికి అధ్యక్షత వహిస్తూ "భారతమాతను ఆరాధిస్తూ, ఆమె కోసం ఎట్టి త్యాగానికైనా వెనుదీయని ప్రతి వ్యక్తి హిందువే" అన్నారు. "సైనికులు యుద్ధరంగానికి పోయేటపుడు సాదా దుస్తులలో పోరు, తమకు నిర్ణయించబడిన యూనిఫారంలో వెళ్తారు. ఈ ప్రత్యేక మైన యూనిఫారం ధరించినంత మాత్రాన వారి నొక ప్రత్యేక వర్గంగా పరిగణించ డానికి వీలు లేదు. అదే విధంగా, నాడు హిందూ సమాజం మీద జరుగుతున్న దాడులను ప్రతిఘటించడానికి గురుగోవింద సింగ్ ఒక సేనాదళాన్ని తయారుచేసి, వారు విశిష్టమైన పంచ'క' కారాలను ధరించి వుండాలని ఆదేశించాడు. అంతమాత్రాన సిక్కులు ఒక ప్రత్యేకవర్గం కాజాలరు. ఆర్యసమాజీయులు మొదలైనవారి వలెనే సిక్కులు కూడ హిందువులే.... గురుగోవిందసింగ్ 'సంత్-సిపాహి'లను తయారు చేశాడు. వారు శాంతి సమయంలో విరాగులై దివ్యత్వానుభూతి కోసం కృషి చేస్తారు, కాని సమాజం అన్యాయానికి అణచివేతకు గురవుతుంటే ఖడ్గధారులై విక్రమిస్తారు. ఆర్. యస్. యస్. కూడ 'సంత్-సిపాహి'లను తయారు చేయడంలో నిమగ్నమై వున్నందుకు నాకు ఆనందంగా వుంది" అని కూడ శ్రీ గుర్నామ్‌సింగ్ అన్నారు.

## రాజకీయ నాయకుడు :

రాజకీయ నాయకుడు శ్రీ ఎన్. జి. రంగా 1968లో నాగపూర్‌లో జరిగిన విజయదశమి ఉత్సవానికి అధ్యక్షత వహించి "జాతి పట్ల భక్తి, సేవా, త్యాగ భావాలు ప్రాతిపదికగా ఆర్. యస్. యస్. చేస్తున్న కృషిని నేను ప్రశంసించకుండా వుండలేను. భగవంతుడు ఈ సంస్థకు ప్రేమాశీస్సుల నివ్వాలని ప్రార్థిస్తున్నాను" అన్నారు.

## సామాజిక నాయకుడు :

కేరళలో నాయర్ సర్వీస్ సొసైటీని సంస్థాపించిన శ్రీ మన్నాత్ పద్మనాభన్ యిలా అన్నారు: "అయిదువేల సంవత్సరాల పైగా చారిత్రక వారసత్వం గల ఒక మహాప్రజ జాతీయ చైతన్యంతో విజృంభించకతప్పదని మనం నమ్మేటట్లయితే మన

మంతా ఆర్. యస్. యస్.తో సహకరించవలసిందే. ఎన్నో కష్టాలకు లోనై సాధించుకున్న స్వాతంత్ర్యాన్ని కూడ ఈ మహత్తర సంస్థ పరిరక్షించగలదు. ఇదొక్కటే నిజంగా హిందూ సంస్కృతికి ప్రాతినిధ్యం వహిస్తున్నది. కనుక భారతదేశ భవిష్యత్తుకు ఆర్. యస్. యస్. ఆశాకేంద్రమని నేను విశ్వసిస్తున్నాను!

## హిందూ రాజ్యాధిపతి :

1965లో నాగపూర్‌లో జరిగిన సంక్రాంతి ఉత్సవానికి ఇచ్చిన స్ఫూర్తిదాయకమైన సందేశంలో నేపాల్ రాజు మహేంద్ర యిలా అన్నారు: "మానవాళిని సముద్ధరించి, విశ్వమానవ సౌభ్రాతృత్వ ఆదర్శాన్ని నిజం చేయటంలో తమ చారిత్రాత్మకమైన పాత్రను హిందువులు నిర్వర్తించాలంటే వారొక సుసంఘటిత శక్తిగా రూపొందక తప్పదు. ఈ ఉద్యమంలో రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ ప్రయోజనదాయకమైన పాత్రను నిర్వహిస్తున్న విషయం స్పష్టమే. ఈ సనాతనము, మహత్తరము, వైభవోపేతము అయిన హిందూ ధర్మాన్ని అనుసరించే మనందరికి హిందుత్వం గర్వకారణం. ఈ ధర్మానికి అనుగుణ్యంగా భారతదేశవాసులను సుసంఘటితమైన అనుశాసనబద్ధమైన సమాజంగా మలచడంలో ఈ సంస్థ నిమగ్నమై వున్నదని తెలుసుకున్న మాకు సహజంగానే ఆనందంగా వుంది. నిజానికి, యీ సంస్థ పరిపూర్ణమైన విజయాన్ని సాధించాలని మేమంతా హృదయపూర్వకంగా ఆకాంక్షిస్తున్నాము. నేపాలీలమైన మేము ఏకైక స్వతంత్ర సార్వభౌమ హిందూ రాజ్యానికి చెందినవారం— అలా ఒక విధంగా ప్రపంచమంతటిలోని హిందువులకు ప్రతినిధులమైన మేము గతిశీల హైందవశక్తి సమూహాలన్నింటికి చేయూతనివ్వాలని అభిలషించడం సహజమే. పశుపతినాథుడు, దేవీ గుహ్యేశ్వరి ఈ ధార్మిక కార్యాన్ని ఆశీర్వదించి, ఆదర్శ హైందవ జీవనాన్ని, ఆదర్శ మానవ జీవనాన్ని ఒక వాస్తవంగా సాక్షాత్కరింపజేయాలని మేము ప్రార్థిస్తున్నాం".

## దేశవ్యాప్తంగా మద్దత్తు

సంఘాన్ని నిషేధిస్తామని 1970లో ప్రభుత్వం బెదిరించగా దేశవ్యాప్తంగా నిరసన వ్యక్తమైంది. ఉదాహరణగా సెక్యులర్ ఫోరంకు చెందిన శ్రీ ఎ. బి. షా ఆ ప్రయత్నాన్ని నిరసిస్తూ "దేశంలో మతకలహాలకు సంఘానిదే బాధ్యత అని తరచుగా ఆరోపణ చేయబడుతున్నది. కాని ఒక హిందువు, ఒక ముస్లిం, ఒక

క్రైస్తవుడు సభ్యులుగా వున్న దయాళ్ కమీషన్ కూడ ఈ ఆరోపణను ఆధార రహితమని త్రోసిపుచ్చింది" అన్నారు. స్వతంత్ర పార్టీకి చెందిన శ్రీ మధుమెహతా "ఆర్. యస్. యస్"పై నిషేధం మోపడమంటే ఉజ్వల దేశభక్తి మీద, అనుశాసనంమీద, జాతీయ సముద్ధరణాదర్శానికి అంకితమై పనిచేయడం మీద నిషేధం మోపడమే"నని విమర్శించారు.

## "గురూజీ మరణించారు" అనేదెవరు ?

శ్రీ గురూజీవలె మన దేశాన్ని అంత విస్తృతంగా పర్యటించిన మహావ్యక్తులు బహుఅరుదు. స్వయంగా కలిసి, లేఖలు వ్రాసి వేలాదిమందిని ఆయన ఉత్తేజితం చేశారు. స్ఫూర్తిదాయకమైన ఆయన నేతృత్వంలో సంఘం ఒక మహాశక్తిగా విజృంభించింది. ఈ పెరుగుదల కేవలం శాఖలు, స్వయంసేవకులు, ఆజీవన ప్రచారకుల సంఖ్యలో మాత్రమే కాదు. చైతన్యవంతమైన ఆయన మార్గదర్శకత్వంలో స్వయంసేవకులు అనేక క్రొత్త రంగాలలో సామాజిక కార్యకలాపాలు ప్రారంభించారు. ధార్మిక, కార్మిక, విద్యార్థి, కిసాన్, గిరిజన రంగం వంటి వైవిధ్యత గల క్షేత్రాలలో నేడు దేశవ్యాప్తంగా విస్తరిల్లి వున్న అనేక సంస్థలు, మరెన్నో సమాజ సేవా పథకాలు శ్రీ గురూజీ నేతృత్వ కాలంలోనే ప్రారంభమైనాయి. తుదివరకు ఆయన జీవితం నిశ్చలజ్యోతి వలె జ్వలిస్తూనే వుంది. 1973లో ఆయన పరమపదించినపుడు ధార్మిక, సామాజిక, రాజకీయాది జీవన క్షేత్రాలకు చెందిన నాయకులు ఆయన జాతికి చేసిన నిరుపమాన సేవలను కృతజ్ఞతాభావంతో సంస్మరించారు. పార్లమెంటు తన సాధారణ సంప్రదాయాన్ని విడనాడి అపూర్వమైన పద్ధతిలో స్వర్గీయ గురూజీకి ప్రగాఢ శ్రద్ధాంజలి ఘటించింది.

తర్వాత నూతన సర్‌సంఘచాలక్ శ్రీ బాలాసాహెబ్ దేవరస్ మార్గదర్శకత్వంలో నాటి నుండి సంఘం పురోగమిస్తూనే వుంది. బాల్యం నుండి సంఘ స్వయంసేవక్‌గా పెరిగిన శ్రీ దేవరస్ సంస్థకు నిజంగా ప్రతిరూపం వంటివారు. తత్వశాస్త్రంలో బి. ఏ. పూర్తి చేసి, న్యాయశాస్త్రంలో కూడ పట్టా పుచ్చుకుని, వెనుకటి యిద్దరు మహానాయకుల అడుగుజాడలలో తాను కూడ బ్రహ్మచారియై పూర్తిగా సంఘ కార్యానికే యావత్తు జీవితాన్ని సమర్పించారు.

వరుసగా 33 సంవత్సరాలపాటు శ్రీ గురూజీ యొక్క స్ఫూర్తివంతమైన నేతృత్వాన్ని, ఋషితుల్య స్వరూపాన్ని గమనిస్తూ వచ్చినవారు అనేకులు ఆ మహా వ్యక్తి ఆకస్మికంగా నిష్క్రమించి ఆయన స్థానాన్ని ఒక క్రొత్త వ్యక్తి అధివహించ



శ్రీ మధుకర
దత్తాత్రేయ దేవరస్

రంతో సంస్థ యొక్క భవిష్యత్ పురోగతి గురించి తీవ్రమైన సందేహాలకు లోనయి వుంటారు. అయితే శ్రీ దేవరస్ దేశవ్యాప్తంగా జరిపిన తొలి పర్యటనలు విజయవంతమవటంతో అలాటి సందేహాలన్నీ పటాపంచలైనాయి. 1973లోమంగుళూరులో శ్రీ దేవరస్ పాల్గొనిన కార్యక్రమం అద్భుతంగా జరిగింది. ఆ కార్యక్రమానికి విచ్చేసిన ప్రముఖ జర్నలిస్టు ఒకరు ఆ సందర్భంలో "శ్రీ గురూజీ మరణించారని ఎవరంటారు?" అని వ్యాఖ్యానించారు.

## అంతరిక బానిసత్వంపై పోరాటం :

ఇంతలో దేశంలోని పరిస్థితులు ఆందోళనకరంగా పరిణమించసాగాయి. ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి జనాకర్షణశక్తి తగ్గుముఖం పట్టింది. ప్రజల ఆశలు అడియాసలైనందున అసంతృప్తి రగులుకొని ప్రజాందోళనలరూపంలో ప్రజ్వరిల్లటం మొదలయింది. వీటన్నిటికి మించి అలహాబాద్ హైకోర్టు తీర్పు, గుజరాత్ ఎన్నికల ఫలితాలతో పరిస్థితి పెద్ద మలుపు తిరిగింది. ప్రజల ఆగ్రహాందోళనలు జయప్రకాశ్ నారాయణ రంగప్రవేశం చేయడంతో ఒక క్రొత్త ధోరణిని సంతరించుకొని

నిర్ణీత దిశవైపుకు మరల్చబడ్డాయి. అధికారపీఠాన్ని అంటిపెట్టుకోవటం యిక ఎంత మాత్రం సాధ్యం కాదని భావించి శ్రీమతి ఇందిరాగాంధి భయగ్రస్తురాలయింది. ఆమెకు వ్యతిరేకంగా పెల్లుబుకుతున్న ప్రజావెల్లువకు అడ్డుకట్ట వేసే ఉద్దేశ్యంతో ఎమర్జెన్సీని ప్రకటించింది.

తన నియంతృత్వానికి వ్యతిరేకంగా ప్రజలను ఉద్యమింపజేయగల సంకల్ప శక్తి, ధ్యేయనిష్ఠ కలిగిన కార్యకర్తలు గల సంస్థ దేశంలో సంఘం ఒక్కటేనని శ్రీమతి గాంధీకి తెలుసు. అందువల్ల చట్టపరంగా సంఘాన్ని నిషేధించి దెబ్బ కొట్టడం జరిగింది. ప్రభుత్వం తన ఆధీనంలో వున్న పత్రికలు, టెలివిజను, రేడియో, సినిమాలు వంటి అన్ని రకాల ప్రచార సాధనాల సహాయంతో విశృంఖలంగా— అదే పనిగా— సంఘ వ్యతిరేక ప్రచారానికి ఒడిగట్టింది. మొదటి కొద్ది రోజులలోనే శ్రీ బాలాసాహెబ్ దేవరస్‌తోసహా 5,000మంది సంఘకార్యకర్తలను 'మీసా' క్రింద నిర్బంధించారు. మరికొన్ని నెలల కాలంలో మరో 25,000 మంది అదే దుష్టచట్టం క్రింద అరెస్టయినారు.

సంఘం యొక్క సిద్ధాంతానికి, సంఘటనకు ఇది అత్యంత విషమ పరీక్ష. దేశం ఒక క్రొత్తతరహా దాస్యాంధకారంలో చిక్కుకుంది. సంఘం అందుకు తగిన విధంగా ప్రతిస్పందించి నియంత యొక్క అణచివేత చర్యలకు వ్యతిరేకంగా ప్రజా ప్రతిఘటనను సమీకరించే కేంద్రంగా రూపొందింది. ఎమర్జెన్సీని బహిరంగంగా ధిక్కరించి తద్వారా ప్రజలలో ఏర్పడి వున్న భయావహస్థితిని తుదముట్టించాలని నిర్ణయించింది. పేరుగాంచిన డాక్టర్లు, న్యాయవాదులు, పారిశ్రామికవేత్తలు, వాణిజ్య

ఎమర్జెన్సీ అసలు స్వరూపం గురించి నిర్భయంగా వాడవాడలా ప్రచారం (ఖమ్మంలో)



వెత్తలు— యిక యితర సాధారణ ప్రజానీకం సంగతి చెప్పేదేముంది— పోరాటంలోకి దూకడంతో నాటి సత్యాగ్రహంలో అరెస్టు అయిన వారి సంఖ్య లక్షను మించి పోయింది. కనివిని ఎరుగని రికార్డును సృష్టించింది. ఎమర్జెన్సీ నిజస్వరూపం బయట పెట్టే ఏ అవకాశాన్ని స్వయంసేవకులు జారవిడుచుకోలేదు. కామన్వెల్తు పార్లమెంటు సభ్యుల సదస్సు జరిగినప్పుడు, బ్రిటిషు పార్లమెంటరీ ప్రతినిధి బృందం రాక సందర్భంలోనూ దేశాన్ని సందర్శించవచ్చిన విదేశాల ప్రముఖ నాయకులందరికీ కూడ రహస్య సాహిత్యం ద్వారా నిజాలను తెలియపరిచారు. జైళ్ళలోను, బయట వున్న రాజకీయ, సామాజిక, విద్యార్థి, కార్మిక క్షేత్రాలకు చెందిన విభిన్న దృక్పథాలు గల వర్గాలన్నిటి మధ్య మైత్రీ సంబంధాలు నెలకొల్పి అజేయమైన 'లోక సంఘర్ష సమితి'గా సంఘటితం చేసి దేశవ్యాప్తంగా ప్రతిఘటన దళాలను నిర్మించారు. సంఘ కార్యకర్తలంతా జైళ్ళలో మగ్గుతూనో, లేక అజ్ఞాతంలో వుండి జాతి స్వేచ్ఛా గౌర వాల పరిరక్షణ కోసం శ్రమిస్తూనో వుండగా అలా సంఘ "స్వర్ణోత్సవ సంవత్సర" వేడుకలు జరిగినతీరు నిజంగా ఒక అపురూపమైన చారిత్రాత్మక ఘట్టం!

## నిరుపమాన మహావిప్లవ శక్తి :

ఎమర్జెన్సీ ప్రారంభమైన చాలా నెలల తరువాత కూడా 1975 డిశంబరులో చండీఘర్‌లో జరిగిన కాంగ్రెసు సభలలో శ్రీమతి గాంధి ఆగ్రహం వెళ్ళగ్రక్కుతూ "ఇంతకు ముందు నామమాత్రంగానైనా లేనిచోట్ల కూడ యిప్పుడు ఆర్. యస్. యస్. బాగా పాతుకుపోతో ౦. నిషేధం విధించిన తరువాత కూడ దాని కార్యకలా పాలు తగ్గుముఖం పట్టలేదు. ఇప్పుడు వారు అజ్ఞాతంగా సుసంఘటితంగా తమ కార్య కలాపాలు కొనసాగిస్తున్నారు. కేరళ వంటి ప్రాంతంలో సయితం ఆర్. యస్. యస్. బాగా బలపడింది...." అన్నారు.

అజ్ఞాత ఉద్యమం ఎంతగా విజయవంతమైందో ప్రఖ్యాత బ్రిటిషు పత్రిక 'లండన్ ఎకనమిస్ట్' ఒక నివేదికలో పేర్కొంటూ దానిని "ప్రపంచంలో వామ పక్షానికి చెందిన ఒకే ఒక విప్లవశక్తి"గా అభివర్ణించింది. "లక్షలాదిమంది ఆర్ యస్. యస్. కార్యకర్తలు దీనినంతటిని నడుపుతున్నారు, మరెందరో నవయువకులు వచ్చి చేరుతున్నారు.... ప్రస్తుతం ఆ సంస్థ యొక్క లక్ష్యం ఒకటే: భారతదేశంలో ప్రజాస్వామ్యాన్ని పునఃప్రతిష్ఠించడం" అని కూడ ఆ పత్రిక వ్రాసింది.

'ఎకనమిస్ట్' పత్రిక యింకా యిలా వివరించింది: ఈ ఉద్యమానికి ప్రజలు తమ పూర్తి సహకారాన్ని యిస్తున్నారు. 60 వేల నుంచి 70 వేల మంది వరకు-

విన్న విరాళాలతో దీనికి ఆర్థిక సహాయం అందజేస్తున్నారు. ప్రభుత్వం అరెస్టు చేయజూస్తున్న దాదాపు 30వేల మందికి పూర్తి రక్షణ లభించింది. వారిలో బల హీనతకు లోనై ప్రభుత్వానికి రహస్య సమాచారం అందించినవారే లేరు. ఆ కార ణంగా ఏ ఒక్కరుగాని పట్టుబడిన సందర్భం యింతవరకు జరుగలేదు. నిజాలను నిర్భయంగా వెల్లడించి సాహిత్యం దేశమంతటా ముద్రించి పంచడం జరుగుతున్నది. రాజకీయ చైతన్యం యింతగా జాగృతమై వున్నందున ఏ క్షణాన అయినా ఒక్క నిప్పురవ్వతో విప్లవం ప్రజ్వరిల్లవచ్చు". మార్క్సిస్టు పార్లమెంటు సభ్యుడైన శ్రీ ఎ. కే. గోపాలన్ సైతం చలించి "వారిలో ఏదో మహోన్నతాదర్శం వున్నది కనుకనే అట్టి సాహస కార్యాలకు, త్యాగసంసిద్ధతకు ప్రేరితులవుతున్నారు" అని సంఘం గురించి అన్నారు.

బయటి ప్రపంచంలోని 82 దేశాలలో విస్తరించి వున్న స్వయంసేవకులు కూడ నిశ్శబ్దంగా కూర్చొనలేదు. వారిలో కొందరు స్థాపించిన "ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా సొసైటీ యింటర్నేషనల్" ప్రపంచ ప్రజలఅంతరాత్మను మేలుకొల్పటంలో గణనీయమైన పాత్ర నిర్వర్తించింది. భారతీయ ఉద్యమ ప్రతినిధులు అమెరికా, బ్రిటన్‌లు సందర్శించవచ్చినపుడు వారి కోసం ఆ దేశాలలో ఆ సంస్థ విస్తృతమైన ప్రచార కార్యక్రమం నిర్వహించింది. బ్రిటన్‌లో అక్కడి పార్లమెంటు సభ్యులను, సంపాదకులను, అమెరికాలో సెనేటర్లను, గవర్నర్లను, ఆమ్నెస్టీ యింటర్నేషనల్ సభ్యులను వారు కలుసుకున్నారు. అనతికాలంలోనే ఆ ప్రముఖులంతా భారతదేశం లోని ఎమర్జెన్సీ యొక్క గోముఖవ్యాఘ్ర స్వభావాన్ని ప్రపంచానికి చాటిచెప్పడంలో తోడ్పడ్డారు. భారతదేశంలోని నిరంకుశ ప్రభుత్వం యొక్క అంచనాలను తారు మారు చేయడంలో యిది కూడ ఒక కీలకాంశంగా పరిణమించింది.

## ఎత్తులను, జిత్తులను చిత్తు చేసిన సంఘం :

తన కింకా ప్రజల మద్దతు వున్నదని ఎన్నికల ద్వారా ప్రపంచానికి చూపెడితే ఆ విధంగా ఎమర్జెన్సీకి చట్టబద్ధత కల్పించడం సాధ్యమని శ్రీమతి గాంధి నమ్మింది. అయితే అజ్ఞాతంగా వున్న సంఘ యొక్క శక్తివంతమైన యంత్రాంగం తన అంచ నాలను తలక్రిందులు చేయగలదని ఆమె అనుమానించింది. అజ్ఞాతంలోని సంఘ అగ్రనాయకులతో మంతనాలు జరపడానికి గూఢచారి శాఖకు చెందిన అత్యంత సీనియర్ అధికారి ఒకరిని పంపించారు. సంఘ కార్యకర్తలు ఎన్నికలరంగం జోలికి రాకుండేట్లయితే సంఘం మీద నిషేధాన్ని తొలగించి జైళ్ళలోని సంఘకార్యకర్తల

సందరిని విడుదల చేస్తామని ఆశ చూపారు. అట్టి అప్రతిష్ఠాకరమైనరీతిలో దొంగ చాటు ఒప్పందాలు తమకు అంగీకారయోగ్యం కావని సంఘనాయకులు సూటిగా చెప్పి ఆ ప్రతిపాదనను తిరస్కరించారు. "ఇదంతా బాలెట్ ద్వారానే పరిష్కారం కానివ్వండి. ఒకవేళ ఇందిరాగాంధీయే గెల్చినా పోరాటం కొనసాగించడానికి మేము సిద్ధంగానే వున్నాం. మా కార్యకర్తలలో– వారు జైళ్ళలో మగ్గుతున్నవారు కాని, బయట అజ్ఞాతంగా పనిచేస్తున్నవారుకాని– ధైర్యోత్సాహాలు ఎంతమాత్రం చెక్కు చెదరలేదు" అని వారు చెప్పారు.

ప్రభుత్వ దూత తమను ఒప్పించడానికి చేసిన అన్ని రకాల వాదాలను తిరస్కరిస్తూ "కేవలం మా స్వప్రయోజనం కోసం ఇట్టి క్లిష్టదశలో జాతిశ్రేయస్సుకు వెన్నుపోటు పొడిచేటంత నీచస్థాయికి అసలు సంఘం దిగజారుతుందని ప్రభుత్వం నిజంగా ఊహిస్తున్నదా?" అని సంఘ నాయకులు ప్రశ్నించారు. అంతటితోచర్చలు విఫలమైనాయి.

## ఎమర్జెన్సీ నిజవీరులు :

తరువాత జరిగిన ఎన్నికల యుద్ధంలో జాతి పరిరక్షణ కోసం సంఘ స్వయం సేవకులు అగ్రభాగాన నిలబడి పోరాడడంతో ఎమర్జెన్సీ రాజ్యం తుడిచిపెట్టుకు పోయింది. 1977 ఎన్నికలలో తనను పదవి నుంచి దిగలాగడంలో సంఘమే ప్రధానంగా కారణభూతమైందని శ్రీమతి ఇందిరాగాంధీయే 1980లో హిమాచలప్రదేశ్‌లోని ఒక ఎన్నికల ప్రసంగంలో 'ఆరోపణ' చేశారంటే, నాటి ఎమర్జెన్సీ వ్యతిరేక పోరాటానికి సంఘమే వెన్నెముకగా నిలిచిందని ఆమె కూడ పరోక్షంగా అంగీకరించారన వచ్చు.

ఎమర్జెన్సీని తొలగించమంటూ బహిరంగంగా సత్యాగ్రహం చేసి ఆనందంగా బేడీలు ధరించిన టుమ్కూరు (కర్నాటక) సంఘ కార్యకర్తలు



ఎమర్జెన్సీ పోరాటపు నిజమైన వీరుడెవరంటే సంఘమేనని ఆబాలగోపాలం సంఘాన్ని కొనియాడారు. ఇట్టి వీరోచిత పాత్ర నిర్వర్తించడంలో స్వయంసేవకులు ఎన్నో త్యాగాలు చేసి, అష్టకష్టాలు భరించారు. నాటి సత్యాగ్రహులలోను, పోలీసుల అమానుష అత్యాచారాలకు గురియైనవారిలోను, ప్రభుత్వోద్యోగాల నుండి తొలగించ బడిన వారిలోను, కళాశాలల నుండి సస్పెండ్ అయినవారిలోను దాదాపుగా అందరూ సంఘ స్వయంసేవకులే.

మన దేశపు అనుభవజ్ఞులైన సంపాదకులలో ఒకరైన శ్రీ ఎం. సి. సుబ్రహ్మణ్యం సంఘం నిర్వహించిన పాత్ర గురించి సమీక్షిస్తూ మద్రాస్‌నుండి వెలువడే తమ 'ఇండియన్ రివ్యూ' (ఏప్రిల్, 1977) పత్రికలో యిలా పేర్కొన్నారు: "ఈ కార్యాన్ని వీరోచితమైన దీక్షతో కొనసాగించిన వర్గాలలో ఆర్. యస్. యస్. వారిని ప్రత్యేకంగా ప్రశంసించవలసి వుంది. సత్యాగ్రహాన్ని నిర్వహించడంలోను, యావద్భారతంలో పరస్పర సంబంధాలను నిలిపి వుంచడంలోను, ఉద్యమపోషణకై నిశ్శబ్దంగా నిధులు సేకరించడంలోను, ఎట్టి ఒడిదుడుకులు లేకుండా సాహిత్యాన్ని రహస్యంగా వితరణ చేసే ఏర్పాట్లలోను, జైళ్ళలో వున్న యితర పార్టీలకు, యితర విశ్వాసాలకు చెందిన తోటి ఖైదీలకు సహాయసహకారాలు అందించడంలోను వారిపాత్ర చూస్తే దేశంలో సాంఘిక రాజకీయ కార్యనిర్వహణకై ఒక సన్యాసుల సంఘటన ఏర్పడాలని స్వామి వివేకానంద యిచ్చిన పిలుపుకు ఆర్. యస్. యస్. సన్నిహితమైన సమాధానమని ఋజువయింది. తోటి రాజకీయకార్యకర్తలు అభిమానంతోపాటు ఒకనాటి రాజకీయప్రత్యర్థుల గౌరవాదరాలను కూడ చూరగొన్న సాంప్రదాయబద్ధమైన విప్లవ శక్తి ఆర్. యస్. యస్."

## జె.పి. అభినందన:

ఎమర్జెన్సీ ప్రారంభం ముందు నుంచి జయప్రకాశ్ నారాయణతో స్వయం సేవకులు ఏర్పరుచుకున్న ఆత్మీయానుబంధం చూచి సంఘమంటే గిట్టనివారు కలవరానికి లోనైనారు. ఫాసిస్టుల బోనులో పడ్డాడంటూ జె. పి.ని వారు నిందించడం కూడ మొదలుపెట్టారు. ఈ ఆరోపణకు జె. పి. స్వయంగా యిచ్చిన సమాధానం తెలుసుకొనడం ఆసక్తికరంగా వుంటుంది. జైలు నుంచి విడుదలై బొంబాయిలోని జెస్లోక్ ఆసుపత్రిలో చికిత్స పొందిన అనంతరం జె. పి. పాట్నాకు బయలుదేరినపుడు ఆయనకు వీడుకోలు యివ్వడానికి బహిరంగసభ జరిగింది. ఎం. సి. ఛాగ్లా, ఎన్. జి. గోరే, ఎస్. యం. జోషి, రాజమోహన్ గాంధీ మొదలైన ప్రఖ్యాతనాయక

లెందరో పాల్గొన్న ఆ సభలో జె. పి. ప్రసంగిస్తూ ఇలా అన్నారు:

"నేను ప్రతిక్రియాత్మకవాదుల మధ్య చిక్కుకున్నానని, మతోన్మాద ఫాసిస్టు శక్తుల వలలో పడ్డానని గత మూడు నాలుగేండ్లుగా కొందరు నామీద తీవ్రమైన ఆరోపణ చేస్తున్నారు. ఇలాంటి ఆరోపణలకు గురి అవుతున్న ఆర్. యస్. యస్. జనసంఘ్‌లలో అట్టి తత్వం ఎంతమాత్రం లేదని, ఆ సంస్థలు పూర్తిగా నిర్దోషులని నా అంతరాత్మ సాక్షిగా చెప్పగలను. ఎమర్జెన్సీ ప్రారంభం ముందు నుంచి వారు నాకిచ్చిన హృదయపూర్వక సహకారాన్ని నిండు మనసుతో మెచ్చుకుంటున్నాను. దేశ శ్రేయస్సుకోసం చేపట్టేపథకాలను అమలుపరచడంలో వారు ఎవరికీ తీసిపోరని నాకు నమ్మకం కలిగింది. వారి మీద, నా మీద చేయబడుతున్న ఆరోపణలన్నీ వట్టి బురద జల్లే నీచప్రయత్నాలే తప్ప మరేమి-కాదు."

అయితే 1977 ఎన్నికల పిమ్మట అలా అందరి నుండి ప్రశంసల పరంపర వెలువడుతున్న విజయోత్సవ సభలో కూడ శ్రీ బాలాసాహెబ్ దేవరస్ తమ సహజ సంతులనాన్ని ప్రదర్శించారు. గతంలో శ్రీ గురూజీ పాటించిన సంప్రదాయాన్నే అనుసరించి 'క్షమించు-విస్మరించు' అని మాత్రమే వ్యాఖ్యానించారు.

## తీవ్ర సమస్యలపై మళ్ళిన దృష్టి :

ప్రస్తుతం దేశాన్ని పట్టిపీడిస్తున్న వివిధ సమస్యల యొక్క నిజస్వరూపాన్ని వెల్లడించడంలో సంఘవాణి రోజురోజుకు ప్రబలమవుతున్నది. సిక్కులు హిందూ సమాజంలోని అవిభాజ్యమైన అంగమనే చారిత్రక సత్యాన్ని సంఘ కేంద్ర కార్యకారీ మండలి పదే పదే స్పష్టీకరించింది: "అకాలీలు, కాంగ్రెసువారి నడుమనున్న రాజకీయ స్పర్థ వలననే నేటి గడ్డు పరిస్థితి తల యెత్తింది. సిక్కులు మన సమాజం పరంపరానుగతంగా అత్యంత పరాక్రమోపేతులు, దేశభక్తి సంపన్నులుగా వున్నా నిజం చెప్పాలంటే హిందూ ధర్మాన్ని, హిందూ సమాజాన్ని సంరక్షించడానికేసిక్కు పంథా ప్రారంభించబడింది. నేడు కూడ సిక్కులంతా అకాలీలు కాదు, అకాలీలం తీవ్రవాదులూ కాదు. పరిస్థితులు ఎంత రెచ్చగొట్టే విధంగా మారినప్పటికి తమ మన స్థిమితము, పరస్పర ప్రేమాభిమానాలు చెదరకుండా నిలుపుకున్న పంజాబీలు— (సిక్కులు, సిక్కులు కానివారు)— అందరూ ప్రత్యేకంగా అభినందింపదగినవారు. గతాన్ని నెమరవేసుకుంటూ కూర్చొనక ప్రభుత్వము వారు, అకాలీలు యిప్పటికైనా చర్చలకు పూనుకొని, న్యాయసమ్మతమైన కోరికలను తీరుస్తూనే రాజ్యాంగ పరిధిలో ఒక పరిష్కారాన్ని సాధించాలి" అని పేర్కొన్నది. ఇటీవల కేంద్ర ప్రభుత్వానికి

అకాలీలకు మధ్య దీనికి అనుగుణ్యంగానే జరిగిన ఒప్పందాన్ని సంఘం స్వాగతించింది.

అస్సాం సమస్యపై సంఘ ఆలోచనలతోనే నేడు అనేకమంది ఏకీభవిస్తున్నారు. అస్సాం ప్రాంతాన్ని ముస్లింల సంఖ్యాధిక్యత గల ప్రాంతంగా మార్చే దురుద్దేశంతో ఒక పథకం ప్రకారం బంగ్లాదేశీయులైన ముస్లింలు దొంగచాటుగా చొచ్చుకు రావడంతో ఈ సమస్య ఉత్పన్నమయింది. అలా చొరబడినవారిని ముందుగా ఓటర్ల జాబితా నుండి తొలగించి తరువాత త్రిప్పి పంపాలి. బంగ్లాదేశ్ నుంచి వచ్చిన హిందువులు శరణార్థులు. వారికి యిక్కడే స్థిరమైన వసతి కల్పించడం మన నైతిక బాధ్యత" అని సంఘం స్పష్టం చేసింది. అస్సాం నాయకులకు, కేంద్ర ప్రభుత్వానికీ మధ్య ఇటీవల జరిగిన ఒప్పందం ఈ దిశలో జరిగిన కొద్దిపాటిప్రయత్నంగా భావించవచ్చు.

'మైనారిటీస్ కమిషన్' ఏర్పరచి అల్పసంఖ్యాకులకు ప్రత్యేక హక్కులు కల్పించడం వల్ల ఎదురు కాగల ప్రమాదకర పరిణామాల గురించి సంఘం చెపుతూ వచ్చింది. దీనిపై సంఘం యొక్క మౌలికమైన అభిప్రాయం సూటిగా స్పష్టంగా వుంది. "ఈ విషయంలో యిటీవలి చరిత్రే మనకు గట్టి హెచ్చరికగా వున్నది. 'అల్పసంఖ్యాక మనస్తత్వాన్ని పాలు పోసి పెంచినందున దేశవిభజన అనే విష ఫలాన్ని మనం రుచి చూడవలసి వచ్చింది. నిజానికి నేడు మనకు కావలసింది కులం, పంథా, భాష, మతం, వంటి పట్టింపులు లేకుండా అన్యాయాలకు గురియైన అన్ని వర్గాలవారి న్యాయసమ్మతమైన కోర్కెలను పరిశీలించే ఒక 'మానవ హక్కుల కమిషన్' మాత్రమే. ఇస్లామిక్ రాజ్యాలవంటి కొన్ని దేశాలలో అల్పసంఖ్యాక మతాలకు చెందినవారికి అధిక సంఖ్యాకులు పొందుతున్న హక్కులనేకం అనుభవించే అవకాశం లేదు. అయితే కొన్ని ప్రజాస్వామిక, కమ్యూనిస్టు దేశాలలో అల్పసంఖ్యాకులకు అధిక సంఖ్యాకులతో సమానంగా న్యాయహక్కులు వున్నాయి. ఒక్క మన దేశంలో మాత్రమే అధిక సంఖ్యాకుల కంటె అల్పసంఖ్యాకులు ఎక్కువ హక్కులు సౌకర్యాలు అనుభవిస్తున్న విచిత్రమైన తలక్రిందుల పరిస్థితి వుంది! అల్పసంఖ్యాకుల ఓట్ల బ్యాంకు మీద పేరాశతో వారిని మన రాజకీయవాదులు మాలిమి చేస్తున్నందు వలననే ఈ వైపరీత్యం ఏర్పడింది. అటువంటి జాతి వ్యతిరేక, హిందూ-వ్యతిరేక రాజకీయవాదులకు, పార్టీలకు మద్దతు నిరాకరించడం ద్వారా ఈ విద్రూరపు పోకడను సరిదిద్దగల సామర్థ్యం హిందూ ఓటర్లకు మాత్రమే వుంది."

సున్నితమైన రిజర్వేషన్ల సమస్య విషయంలో సంఘ వైఖరి సామాజిక సామరస్యానికి, సాంఘిక న్యాయానికి మధ్య సమన్వయాన్ని నెలకొల్పేదిగా ఉన్నది.

"వెనుకబడిపోయిన మన సోదరులను సమాజంలోని తక్కినవారితో సమాన స్థాయికి తీసుకురావాలంటే కొంతకాలం రిజర్వేషన్లు కొనసాగించవలసిన అవసరం వుంది. కాని అమలుచేయడంలో వున్న లోపాల కారణంగా ప్రస్తుత విధానాలన్నీ కేవలం ఎన్నికల రాజకీయాలకు సాధనాలుగా మాత్రమే ఉపయోగపడుతున్నాయి. రిజర్వేషన్లను శాశ్వతం చేస్తే నిహిత స్వార్థం పెరిగి, అర్హతకు సామర్థ్యానికి చోటులేక సమాజంలోని అనేక వర్గాల మధ్య ఉద్రిక్తతకు ఘర్షణలకు దారి తీస్తుంది కనుక అలా జరగడానికి వీలులేదు. నిష్పక్షపాతులైన సమాజ శ్రేయోభిలాషులు కలిసి కూర్చొని, ఈ సమస్యను లోతుగా అధ్యయనం చేసి, హరిజన గిరిజన సముద్ధరణ కోసం గైకొనదగిన చర్యలను సూచించాలి. దానితోపాటు ఆర్థికంగా వెనుకబడిన యితర వర్గాలకు కూడ చేయూత నివ్వాలి."

---



శ్రీ బాలాసాహెబ్ దేవరస్, ఆంధ్ర ప్రాంత సంఘచాలక్ శ్రీ పిన్నమనేని లింగయ్య

శ్రీ బాలాసాహెబ్ దేవరస్ తమదైన ఒక విశిష్ట శైలిలో సంఘ ఆలోచన కార్యక్రమాల వెనుకనున్న వివిధ తాత్విక అంశాలను ప్రతిపాదిస్తున్నారు. "అంటరానితనం తప్పు కాకపోతే ప్రపంచంలో మరేదీ తప్పు కాదు" అని ఎన్నో మార్లు ఆయన ప్రకటించారు. మన సమాజం యొక్క గతిశీల స్వభావాన్ని వివరిస్తూ "కాల దోషంపట్టిన నమ్మకాలకు, ఆచారాలకు స్వస్తి పలుకుతూ, క్రొత్తవాటిని సృజించు కుంటూ ఈ సమాజం ఎల్లప్పుడూ వికసిస్తూనే వుంది. మన సాంస్కృతిక వారసత్వంలోని శాశ్వత మూల్యాలను పరిరక్షిస్తూ వున్నప్పటికి గతంలోని దంతా బంగారంగా మనం పరిగణించం" అన్నారు.

"విస్తృతమైన జాతీయ దృక్పథంలో 'హిందువు' అనే పదం మన దేశాన్ని మాతృభూమిగా పరిగణించి, మన జాతీయవీరులను గౌరవిస్తూ, మన సాంస్కృతిక పరంపరకు దోహదం చేసే అందరిని సూచిస్తుంది. అయితే దీనికి ప్రస్తుతం చెలామణిలో వున్న అర్థాన్నే స్వీకరించినా హిందువులను సంఘటితం చేయడం గొప్ప జాతీయ ఆవశ్యకత. ఎందుకంటే అన్ని రాజకీయపక్షాల చేత ఆదర్శాలుగా స్వీకరించబడిన సెక్యులరిజం, ప్రజాస్వామ్యం, సోషలిజం అనే సూత్రాలకు అధిక సంఖ్యాకులైన హిందువుల సంఘటన మాత్రమే హామీ యివ్వగలుగుతుంది"— ఈ సత్యాన్ని మన ప్రజల చేత, ముఖ్యంగా రాజకీయవాదులచేత గ్రహింపజేయడానికి విసుగు లేకుండా శ్రీ బాలాసాహెబ్ పదేపదే చెప్తున్నారు.

మతమార్పిడులు సెక్యులరిజానికి విరుద్ధమని శ్రీ బాలాసాహెబ్ ప్రతిపాదించే వాదాన్ని ఎవరూ కాదనలేరు: "మత మార్పిడులకు పాల్పడుతున్నారంటే తమ మతం మిగతా మతాల కంటె గొప్పదనే దురంహకారం వున్నదని అర్థం. కనుక ఇతరులను తమ మతంలోకి మార్చడం తమ హక్కుగా వారు భావిస్తారు. దీని ఫలితంగా ఇతరులు నిరాఘాటంగా తమ అంతరాత్మను అనుసరించే హక్కుకు భంగం కలుగుతుంది. అన్ని మతాల అనుయాయులకు సమాన హక్కులను, స్వేచ్ఛను సూచించే సెక్యులరిజపు భావనను యిది ఖచ్చితంగా అతిక్రమిస్తున్నది. ఒరిస్సా, మధ్యప్రదేశ్, అరుణాచలప్రదేశ్ వంటి ప్రాంతాలలో ఆమోదింపబడిన మతస్వేచ్ఛబిల్లు సెక్యులరిజపు భావనకు అనుగుణ్యంగా రూపొందించబడింది. హరిజనులు, గిరిజనులు మొదలైన బలహీనవర్గాలను పరమతానుయాయుల మతదురహంకారపు దాడుల నుండి రక్షించడానికి యిది ఉద్దేశించబడింది" అని శ్రీ దేవరస్ స్పష్టంగా చెప్తున్నారు.

## సంఘ వేదికపై నినదించిన పంజాబ్ అంతరాత్మ :

అన్ని వర్గాలు, అన్ని స్థాయిలకు చెందిన ప్రజల దగ్గరికి వెళ్ళుతూ త్వరిత గతిని సంఘం విస్తరిస్తున్నందున వివిధ క్షేత్రాలకు చెందిన ప్రఖ్యాత వ్యక్తులు ఎందరెందరో నేటి క్లిష్ట సమస్యల గురించి తమ మనసులోని మాటను సంఘ వేదిక నుండి ప్రకటించడానికి సిద్ధపడుతున్నారు. 1984 ఆగస్టులో మద్రాసులో జరిగిన గురుదక్షిణోత్సవానికి సర్దార్ కుష్వంత్‌సింగ్ అధ్యక్షత వహించారు. ప్రతిఫలాపేక్ష లేకుండా దేశం కోసం తమ సర్వస్వాన్ని సమర్పించిన మహాత్మాగాంధి, జె. పి., శ్రీ గురుగోళ్వాల్కర్, శ్రీ బాలాసాహెబ్ దేవరస్ వంటి నాయకుల ఆవశ్యకత నేడు ఎంతగానో వున్నదని ఆయన అన్నారు.

తాము జీవించి వుండగా ఖలిస్తాన్ అవతరించడమనేది కల్ల అని తాను యిం
వరలో పేర్కొన్న విషయాన్ని శ్రీ సింగ్ పునరుద్ఘాటించారు. సాధారణ సిక్కు
ప్రజానీకానికి ఖలిస్తాన్‌పట్లగాని, భింద్రన్‌వాలేపట్లగాని అభిమానం లేదని ఆయ
చెప్తూ హిందూ సమాజమే సిక్కుల మాతృసంస్థ అని, హిందువులతో బాంధవ్యం లే
ఒక్క సిక్కు కుటుంబాన్నయినా చూపడం చాలా కష్టమని ప్రతి ఒక్కరికి ఆయ
గుర్తు చేశారు.

దేశవిభజన సమయంలోను, కరువులు, వరదలు, కలహాలు చెలరేగిన సమ
యంలోను దేశవ్యాప్తంగా ఆర్. యస్. యస్. వారు చేసిన చిరస్మరణీయమైన
సేవలను ప్రస్తావిస్తూ, దేశసమైక్యత కోసం తాను పడుతున్న ఆరాటమే తనన
ఆర్. యస్. యస్.కు సన్నిహితం చేసిందని శ్రీ కుష్వంత్‌సింగ్ వివరించి "ఆర్.
యస్. యస్. యొక్క ఉజ్జ్వల దేశభక్తిని ఎవరూ సందేహించజాలరు" అ
పేర్కొన్నారు.

1984 సెప్టెంబరులో ఢిల్లీ సంఘ కార్యాలయంలో జరిగిన గురుపూజ
ఉత్సవంలో పంజాబ్ విశ్వవిద్యాలయపు "స్కూల్ ఆఫ్ పంజాబీ స్టడీస్ చైర్మన్
అయిన పద్మశ్రీ ప్రొ॥ అత్తర్‌సింగ్ పాల్గొన్నారు. వారు వ్యక్తం చేసిన భావాల
ప్రతి హిందువు యొక్క హృదయాన్ని స్పృశించక తప్పవు: "జాతీయ సంస్కృతి
లోని వివిధ స్రవంతుల యొక్క నిజమైన సంగమాన్ని యిక్కడే నేనుచూస్తున్నాను
సిక్కు మతానుయాయులలో అధికసంఖ్యాకులు ఖలిస్తాన్‌ను కోరడం లేదు. భారత
దేశంలోనే జీవించాలని, భారతదేశం కొరకే మరణించాలని వారు కోరుకుంటున్నారు
హిందూ ధర్మం, సంస్కృతుల పరిరక్షణకై ముస్లిం మతోన్మాదాన్ని ప్రతిఘటించి
మధ్యయుగపు సిక్కు చరిత్రే సామాన్య సిక్కు ప్రజానీకానికి స్ఫూర్తిగా ఈనాటికీ ని
వుంది. ఈ వాస్తవాన్ని మరుగుపరచజూచినందువల్ల మనం వేర్పాటువాదశక్తు
సహకరించినట్లయింది. ఆర్. యస్. యస్. వారు, నా వంటివారు ఈ సత్యాన్ని
స్పష్టం చేసి ధృఢతరం చేయడానికి కటిబద్ధులై వున్నారు. మన అనుబంధాన్ని
ఎవరూ త్రెంచలేరు. భారతదేశంలో అంతర్భాగంగానే పంజాబ్ సర్వదా నిలి
వుంటుందని, ఈ మహత్తర హిందూ సమాజపు అవిభాజ్యమైన అంగంగానే సిక్కు
మతం కూడ నిలిచివుంటుందని నేను దృఢంగా విశ్వసిస్తున్నాను" అని ఆయ
అన్నారు.

## వ్యక్తి నిర్మాణమే సంఘ కార్యం :

తమిళనాడులో విద్యావ్యాప్తికి, ఆధ్యాత్మిక చైతన్యానికి తన జీవితాన్ని అంకితం చేసిన 88 సం॥ల యోగి పుంగవులు స్వామి చిద్భవానంద నేడు సంఘానికి దృఢమైన ఆధార స్తంభంగా వున్నారు. 1980లో తిరువేదగంలోని తమ కళాశాలలో నిర్వహించబడిన సంఘ శిక్షణాతరగతులలోని శిక్షార్థులకు ఆశీస్సులు పలుకుతూ "మీరంతా ఎంతో అదృష్టవంతులు. ధన్యజీవులు. ఎందుచేతనంటే యీ కార్యం ఒక మనుష్యమాత్రుని సృష్టి కాదు. మన మాతృభూమి యొక్క వైభవం కొరకు, సకల మానవాళి యొక్క విముక్తి కొరకు సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుడే యీ కార్యాన్ని అవతరింపజేశాడు. మన దేశ యువత కోసం అలనాడు స్వామివివేకానంద కలగన్న వ్యక్తి నిర్మాణ శిక్షణనే యీనాడు సంఘంలో మీరు పొందుతున్నారు" అన్నారు శ్రీ చిద్భవానంద.

ఆర్. యస్. యస్.కు రాజకీయాలతో సంబంధం లేదని, స్వామి వివేకానంద చేసిన వ్యక్తి నిర్మాణ కృషినే చేస్తున్నదని ప్రఖ్యాత సోషలిస్టు శ్రీ సమర్ గుహ 1977 సెప్టెంబరులో తమ జనతా సహచరులకు చెప్పారు.

## 'నా కలలు పండించేది మీరే' జె.పి.

ఒకానొకప్పుడు సంఘాన్ని నిశితంగా విమర్శించిన శ్రీ జయప్రకాశ్ నారాయణ్ 1977 నవంబరులో పాట్నా సంఘ శిక్షణా శిబిరపు ముగింపు సభలో ప్రసంగిస్తూ నిర్మొగమాటంగా చెప్పిన విషయాలు సంఘానికేగాక ఆయన యొక్క నిష్పాక్షిక వైఖరికి కూడ నీరాజనమనడంలో అతిశయోక్తి లేదు. సంఘం చేపట్టవలసివున్న వివిధ బృహత్కార్యాల గురించి సవివరంగా పేర్కొని "నవభారత నిర్మాణపు సవాలును స్వీకరించిన యీ విప్లవ సంస్థపై నాకెన్నో ఆశలున్నాయి. ఒకప్పుడు మీకు నేను సలహా యిచ్చాను, విమర్శించాను కూడాను– అయితే అదంతా మీ మిత్రునిగానే– మీ శక్తిసామర్థ్యాలు నే నెరుగుదును కనుకనే అలా చేశాను. మీకు సాటి రాగల సంస్థ మరొకటి దేశంలో లేదు."

"విభిన్న మతాలు, వర్గాల కోర్కెలను తీరుస్తూ కూడ మనం ఒకే జాతిగా నిలచివుండగలమనే అచంచల విశ్వాసం నాకుంది. గతంలో యిస్లాం, క్రైస్తవం వంటి మతాలలోకి జరిగిన మార్పిడి వలన వేర్పాటు మనస్తత్వం ప్రబలింది. దానిని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతదేశ విభజనకు వినియోగించుకున్నారు. కాని నేను మాత్రం



"నవభారత నిర్మాణానికి అగ్రేసరులు మీరే"
1977లో పాట్నా సంఘ బహిరంగ సభలో శ్రీ జయప్రకాశ్ నారాయణ

బంగ్లాదేశ్, పాకిస్తాన్‌లతోసహా మనమంతా ఒకే జాతి అని నమ్ముతున్నాను. మన రాజ్యాలు వేరు కావచ్చు కాని మన జాతి మాత్రం ఎప్పుడూ ఒకటే— భారత జాతి. ఆ ఐక్యత కొరకే మనం కృషి చేయాలి.... మీ ప్రాతఃస్మరణలో మహాత్మాగాంధీని కూడ స్మరిస్తున్నారు, యిదెంతో మంచి విషయం. హిందూసమాజంలోని అస్పృశ్యత వంటి దోషాలను తొలగించడం గాంధీజీ హృదయానికి ప్రీతిపాత్రమైన కార్యం. ఈ కార్యాన్ని నా కంటె మీరే చక్కగా నిర్వహించగలరు. ఎందుకంటె మనపరంపర, మన సంస్కృతి, ధర్మాల గురించి నిరంతరమైన ఆలోచన, చర్చలలో గడిపే మీరే అందుకు సమర్థులు."

"ఈ సమాజము, దీని వైభవోపేతమైన చరిత్ర, మన పూర్వజుల వారి సత్వము, ఈ దేశనిర్మాతల త్యాగసమర్పణలు, వారి ఘనవిజయాలు, మనం గెలుచుకున్న స్వాతంత్ర్యం— వీటన్నిటికి వారసులు మీరు. వీటిని అత్యుత్తమ రీతిలో వినియోగించుకొనవలసినవారు మీరే. మహత్తర ఆధ్యాత్మిక శక్తి, వేలాది సంవత్సరాల మన ప్రాచీన సంస్కృతి మీకు అండగా వున్నాయి. మన కన్నుల యెదుట జరుగుతున్న సంపూర్ణ క్రాంతిలో కూడ మీరు అగ్రభాగాన వున్నారు. ఈ క్రాంతి నుండి వెలువడే ఫలం కూడ మీదే."

"మిత్రులారా, సేవ, త్యాగ, సమర్పణలే మీకు ఆదర్శాలుగా వుండాలని ఆకాంక్షిస్తున్నాను. మీలో యిప్పటికే యీ ఆదర్శాలు జీర్ణించి వున్నాయని, ఆత్మ సమర్పణ మీ స్వభావమని, మీ సౌశీల్యము ధీరోదాత్తమైనదని నాకు ఎటువంటి సందేహం లేదు. మీరెంతో సాధించగలరు. పరమేశ్వరుడు మీకు శక్తినివ్వాలని మీపై వున్న ఆశలను మీరు నెరవేర్చగలరనీ నేను కోరుకుంటున్నాను."

## కొత్తవెలుగు బాటలో :-

భారత స్వాతంత్ర్యానంతరకాలపు పరిస్థితులు ఒక ప్రత్యేకమైన సవాలుగా పరిణమించాయి. మన ముందున్న అసలైన జాతి నిర్మాణ కార్యం ఎంతో కఠినమైనది, ముళ్ళబాట వంటిది. పరమ స్వార్థప్రవృత్తిలో, పరస్పరాసూయల్లో, అంతఃకలహాలలో కూరుకొనిపోయిన ప్రజను ఆ అగాధం నుండి పైకి తీసి, జాతి పట్ల వారికున్న కర్తవ్యాన్ని గురించిన ప్రగాఢ చైతన్యాన్ని జాగృతం చేయవలసి వుంది. పైగా శతాబ్దాలపాటు సాగిన విదేశీ పాలన ఫలితంగా వారిలో బానిస మనస్తత్వం ప్రబలి వుంది. ఒక ఆదర్శమంటూ లేని శూన్యస్థితి ఏర్పడి వుంది. జాతీయ వ్యవహారాలను నడుపుతున్న నాయకులు విదేశాల నుండి అరువు తెచ్చుకున్న ఏవో నినాదాలు, ప్రణాళికలతో ఆ శూన్యాన్ని పూరించజూశారు. వీటి స్థానే ఆత్మగౌరవ ప్రవృత్తిని, స్వావలంబనను, జాతి యొక్క పూర్వపు మేధాపాటవాన్ని తక్షణమే సముద్ధరించవలసి వుంది. ఇదంతా ధైర్యసాహసాలతో, చెక్కుచెదరని పట్టుదలతో ఒక అభినవ భగీరథుడు మాత్రమే ప్రయత్నించగల బృహత్కార్యం.

క్లుప్తంగా చెప్పాలంటే మన జాతి అజేయంగా, వైభవోపేతంగా రూపొందే వరకు మరెన్నో రంగాలలో జాతీయ పునర్నిర్మాణానికై పోరాటం కొనసాగించవలసి వుంది. ఈ మహత్తర కార్యనిర్వహణకే రాష్ట్రీయ స్వయంసేవక సంఘం తనను అంకితం చేసుకొన నిశ్చయించింది.

ఇన్ని సంవత్సరాలుగా జాతీయ జీవనపు వివిధ రంగాలలో సంఘం నిరంతరంగా విస్తరింపజేస్తున్న కార్యకలాపాలన్నీ సరిగా యీ లక్ష్యసాధన కొరకే చేపట్టబడుతున్నాయి. సంఘాన్ని శైశవావస్థ నుండే యిదే ఆశయంతో డాక్టర్‌జీ వికసింపజేశారు. "సంఘం ఒక విద్యుదుత్పాదన కేంద్రం. ఇది ఉత్పత్తి చేసే విద్యుత్తుతో దీపాలు వెలిగించుకోవచ్చు, వంట చేసుకోవచ్చు, యంత్రాలు నడుపుకోవచ్చు మరెన్నో చేయవచ్చు" అని డాక్టర్‌జీ అంటూండేవారు. సమగ్రమైన జాతీయ పునరుజ్జీవనం కోసం మనం కనే కలలు నిజం కావాలనే దీక్షతో జాతీయ జీవనంలోని ప్రతి రంగంలోను అందుకోసం కృషి చేస్తూ, ఆ కార్యసాధనకై అవసరమైన గుణగణాలను కలిగి, అనుశాసనబద్ధులు, ధ్యేయ దీక్షాదక్షులు అయిన స్వయంసేవక బృందమే సంఘంలో ఉత్పత్తి చేయబడుతున్న 'విద్యుత్తు'. నిత్యశాఖలో ప్రార్థన చేసే సమయంలో స్వయంసేవకుల మనస్సులో, హృదయంలో ఆవాహన చేయబడేది సమాజం

యొక్క పరమవైభవ స్థితి- సంపూర్ణమైన సర్వాంగీణ ఉన్నతి మాత్రమే. ఆ స్వప్నమే వారిని నిరంతర మహత్తర కృషికి ప్రేరేపిస్తున్నది.

ఈ చారిత్రాత్మక పాత్రను స్వయంసేవకులు నిర్వర్తించడానికి కావలసిన ప్రాథమిక మార్గనిర్దేశక సూత్రాలను డాక్టర్‌జీ రూపొందించారు. దీనికి శ్రీ గురూజీ విస్పష్టమైన రూపురేఖలు భావపరిపుష్టి చేకూర్చనారంభించారు.

శ్రీ గురూజీ భావతరంగిణి "బంచ్ ఆఫ్ థాట్స్" అనే పుస్తకానికి పరిచయం వ్రాస్తూ ప్రొ॥ ఎం. ఏ. వెంకటరావు జాతీయ పునరుజ్జీవనానికి సంబంధించిన యీ విశిష్టమైన సమగ్ర కల్పనను ప్రస్తావిస్తూ- "జాతి యొక్క మనోదర్పణం ఎదుట సంఘం ఒక భవ్యమైన దృశ్యాన్ని నిలుపదల్చింది. అట్లాంటి ఉత్తమ భారతీయ సమాజము తత్త్వము, కళలు, సామాజిక వ్యవస్థల వంటి అన్ని జీవన రంగాలకు, సంస్కృతికి సంబంధించిన విలువలను, వాటి స్వరూప స్వభావాలను (గురూజీయొక్క) ఈ భావతరంగిణి నెమ్మదిగా, ఓపికగా వివరిస్తూ పోతుంది"—.

ఈ 'మూల్యాల స్వరూప స్వభావాలను' సాకారం చేసేందుకు స్వయంసేవకులు అనేక సంస్థలను ప్రారంభించారు. అయితే ఈ సంస్థలన్నీ తాము ఏర్పరుచుకున్న ప్రత్యేక నియమ నిబంధనలతో, ప్రత్యేక కార్యవర్గంతో, ప్రత్యేక విధానాలు కార్యక్రమాలతో పూర్తిగా స్వతంత్రంగా నడుస్తున్నాయి.

## ముందుకు వచ్చిన ధర్మాచార్యులు :

హిందూ సమాజానికి, హిందూ ధర్మానికి- లోపల నుంచి, బయట నుంచి- పెరిగిపోతున్న ప్రమాదాలను దృష్టిలో వుంచుకొని పరిశీలిస్తే, మన ధర్మశాస్త్రాలను పునర్వ్యాఖ్యానించి, కొన్ని అలవాట్లను, ఆచార వ్యవహారాలను సమీక్షించవలసిన పని యిప్పటికే ఆలస్యమయిందనవచ్చు. ఈ తక్షణ పరమావశ్యకతను నెరవేర్చే ఉద్దేశ్యంతో విభిన్న సంప్రదాయాలకు, మతాలకు చెందిన ధార్మిక నాయకులంతా కలిసి విశ్వహిందూ పరిషత్‌ను ప్రారంభించాలని నిర్ణయించారు. 1964లో బొంబాయిలో స్వామి చిన్మయానందుల సాందీపని ఆశ్రమంలో దీని శుభారంభం జరిగింది. ప్రయాగలో 1966లో జరిగిన తొలి ప్రపంచ హిందూ సమ్మేళనం, 1979లో అంతకంటె పెద్ద యెత్తున అక్కడే జరిగిన రెండవ సమ్మేళనం- ప్రపంచంలో ఇంతకు ముందెన్నడూ ఎక్కడా జరగనంత బృహత్తర హిందూ సమ్మేళనాలుగా పరిగణన పొందాయి. 1979నాటి సమ్మేళనంలో శైవులు, వైష్ణవులు, ఆర్య సమాజీయులు, సిక్కులు, జైనులు, బౌద్ధులు, లింగాయతులు మొదలైన ప్రతి పంథాకు,



ధర్మమూర్తులు ఏకత్రితమయ్యారు

ప్రతి సంప్రదాయానికి చెందిన ధార్మిక నాయకులంతా అంటరానితనాన్ని బహిష్కరిస్తూ ఒక తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు.

అంతకు ముందు కూడ **1969**లో ఉడిపిలో జరిగిన విశ్వహిందూ పరిషత్ సమ్మేళనంలో ఈ విషయంపై జగద్గురువులు, ధర్మాచార్యులు ఒక చరిత్రాత్మకమైన ఆదేశాన్ని జారీ చేశారు. "హిందూసమాజాన్నంతటిని సమైక్యపరచడానికీ, 'స్పృశ్యత', 'అస్పృశ్యత' వంటి భావాలవల్ల, వైఖరి వల్ల విచ్ఛిన్నత జరుగకుండా నిరోధించ డానికీ ప్రపంచమంతటా వున్న హిందువులంతా పరస్పర సంబంధాలలో ఏకత్వ సమానత్వ వైఖరిని పాటించాలి" అని అందులో ఆదేశించబడింది. ఆ విధంగా 'హైందవాః సోదరాః సర్వే' (హిందువులంతా సోదరులే) అనే సరిక్రొత్తవిప్లవాత్మక మైన సామాజిక సమతా మంత్రం ఆవిర్భవించింది.

ఉపేక్షిత వర్గాలతో కలిసి మెలిసి తిరుగుతూ పలువురు **మఠాధిపతులు**

స్వయంగా ఈ ఆదేశాన్ని ఆచరణలో చూపనారంభించారు. మనకు శిరోధార్యమైన ఏ ధర్మశాస్త్రంలోను అస్పృశ్యతను విధించడం జరుగకపోగా, కనీసం దాని ప్రస్తావన అయినా వాటిలో లేదని ఈ ప్రముఖ ధర్మాచార్యులు నిర్ద్వంద్వంగా చేసిన ప్రకటన ఆ సాంఘిక దురాచారం ధర్మంలో ఒక భాగమనే దురభిప్రాయాన్ని పారద్రోల డానికి ఎంతగానో దోహదం చేసింది.

మన సమాజంలోని ఉపేక్షిత సోదరులను క్రైస్తవులు, ముస్లింలు మతాంత రీకరణకు ప్రత్యేక లక్ష్యంగా పెట్టుకున్నారు. హిందూ వ్యతిరేకశక్తులైన ముస్లింలు క్రైస్తవులు, కమ్యూనిస్టులు— ఈ ముగ్గురూ కులాల మధ్య సంఘర్షణలను కూడా రెచ్చగొట్టసాగారు. మన ధర్మాచార్యులు నేడు చైతన్యశీలురై ఉద్యమించడంతో యీ విపత్తులన్నిటిని త్రిప్పికొట్టే అడ్డుగోడ ఏర్పడినట్లయింది. దక్షిణ తమిళనాడులో మీనాక్షిపురంలో సామూహిక మతమార్పిడి తర్వాత లక్షలాదిమంది ఉపేక్షిత సోదరులను మతమార్పిడి చేసే కుట్రను చైతన్యశీలురైన ధర్మాచార్యులు, వందలాది హిందూ ఉద్యమకారులు సకాలంలో తీవ్రమైన కృషి చేసి విఫలం చేయగలిగారు.

## పునరాగమన ఉద్యమం :

మన ధర్మాన్ని వక్రీకిస్తూ చేసిన మరో దోష భూయిష్టమైన, ఆత్మహత్యా సదృశ్యమైన వ్యాఖ్యానం వల్ల హిందూ సమాజానికి దారుణమైన నష్టం వాటిల్లింది. ఇస్లాం, క్రైస్తవాలలోకి మారిన హిందువులు తిరిగి హిందుత్వాన్ని స్వీకరిస్తామంటే అందుకు మన ధర్మం అంగీకరించదనే సాకుతో మన ధర్మాచార్యులు తిరస్కరిస్తూ వచ్చారు. ఉదాహరణకు, దాదాపు ఒక శతాబ్దం క్రిందట కాశ్మీరులోని ముస్లిం మతానుయాయులంతా తిరిగి తమ పూర్వీకుల హైందవ మతాన్ని స్వీకరించడానికి సిద్ధపడగా చివరి క్షణంలో పండితులు జోక్యం చేసుకొని వారి పునరాగమనాన్ని నిరోధించారు. కాని నేడు పరిషత్ ఆధ్వర్యంలో ధర్మాచార్యులు తగు సవరణలు చేస్తు న్నారు. అట్టి పునఃస్వీకరణకు మన ధర్మంలో స్పష్టమైన అనుమతి వున్నదని వారు ప్రకటించడమే కాక, పునరాగమనోత్సవాలలో ప్రముఖ పాత్రను కూడ నిర్వహిస్తు న్నారు. ఆ విధంగా "న హిందుః పతితో భవేత్"— ఏ హిందువూ శాశ్వతంగా పతితుడు కాడు— అనే క్రొత్త స్మృతిని వారు రూపొందించారు. పరిషత్ ఆధ్వ ర్యంలో గత మూడు సంవత్సరాలలో 66 వేలమంది హిందూ ధర్మాన్ని తిరిగి స్వీక రించారు. వేయి సంవత్సరాలుగా హిందూ ధర్మం నుంచి ఇస్లాం, క్రైస్తవాలలోకి తరలివెళ్ళిన జనప్రవాహ గతిని, దాని యొక్క అనేక విపత్కర పరిణామాలను



కదిరి విష్ణు దుర్గలో పునరాగమనోత్సవం :
దేశమంతటా వేలాదిమంది మాతృధర్మంలోకి తిరిగి వస్తున్నారు

నేడు పరిషత్ ప్రారంభించిన ఉద్యమం ద్వారా మాత్రమే పూర్తిగానిరోధించగలమనీ ఆ ప్రవాహాన్ని వెనుకకు సైతం మరల్చగలమని స్పష్టమయింది.

దేశంలోని ప్రముఖ మఠాధిపతులంతా పరిషత్‌లో 'ధర్మసంసద్'గా ఏర్ప సామాజిక సమస్యలు చర్చిస్తూ హిందు సమాజం సద్గుణోపేతంగా, సామరస్య పూర్వ కంగా జీవించడానికి కావలసిన మార్గ నిర్దేశక సూత్రాలను రూపొందిస్తున్నారు.

## ధర్మం సమాజపరం కూడా:

దేశవ్యాప్తంగా పరిషత్ కార్యకర్తలు నడుపుతున్న బహుముఖమైన సామా జిక సేవాకేంద్రాలు యింతవరకు వ్యక్తిగత వ్యవహారంగా భావించబడుతూ వచ్చి 'ధర్మ' భావనకు ఒక చైతన్యవంతమైన సామాజిక లక్షణాన్ని సంతరింపజేశాయి. సామాజిక లక్ష్యాల సాధన నిమిత్తం 1982లో పరిషత్ చేపట్టిన నిధి సేకరణో




దేశచరిత్రలోనే అపూర్వమైన రీతిలో ఏకాత్మతా యజ్ఞం అద్భుతంగా జరిగింది.

మానికి హిందూ ప్రజానీకం అద్భుతంగా ప్రతిస్పందించి దాదాపు 4 కోట్లరూపాయలు సమర్పించింది. సామాన్య ప్రజల చేత సామాన్య ప్రజల నుండి సేకరించబడిన అత్యధిక నిధిగా ఒక రికార్డు సృష్టించబడింది. భారతమాత, గంగామాతల విగ్రహాలతో సాగిన ఏకాత్మతా యజ్ఞం (312 ప్రధాన, అనుబంధ యాత్రలతో కలిసి) 85, 875 కి. మీ. సాగింది. దీనిలో 2, 34, 634 గ్రామాలకు చెందిన 7 కోట్ల 80 లక్షల మంది ప్రజానీకం పాల్గొన్నారు. మన ధార్మిక, సాంస్కృతిక పునరుజ్జీవన చరిత్రలో నిస్సందేహంగా యిదొక అపూర్వ సంఘటన.

## వనవాసులలో నవచైతన్యం :

తొలుత మధ్యప్రదేశ్‌లో 1952లో స్థాపించబడిన వనవాసీ కళ్యాణ ఆశ్రమం కార్యకలాపాలు నేడు అన్ని ప్రాంతాలకు విస్తరించాయి. ఈ వనవాసులను బ్రిటిషు వారు 'ఆది'వాసులుగా వ్యవహరిస్తూ విభజించి పాలించే తమ విధానంతో వారిని అన్యాయానికి గురి చేశారు. మతమంటే తెలియని 'జంతుపూజారు'లని వారిని అభి

వర్ణించారు. వనవాసుల ప్రాంతాలను 'రక్షిత స్థలాల' పేర అష్టదిగ్బంధం చేసి క్రైస్తవ మిషనరీలను మాత్రమే పోనిచ్చి మతం మార్పిడి ద్వారా సాంస్కృతికంగా, జాతీయతాపరంగా ఇతరులకు దూరమయ్యేటట్లు కుతంత్రాలు సాగించారు. నేడు మొదటిసారిగా వందలాదిమంది హిందూ మిషనరీలు ఆ ప్రాంతాలకు వెళ్ళి సమతా సోదరత్వ భావనలతో ప్రేమతో సేవాకార్యక్రమాలు చేపడుతున్నారు.

ఈశాన్య భారతంలోని 182 వర్గాల మధ్య పరస్పర సంబంధాలను దృఢతరం చేయడానికి, వారిని భారత జాతీయతా ప్రధాన వాహినిలో కలపడానికిగాను 'భారతీయ జనజాతి సాంస్కృతిక మంచ్' (ఇండియన్ ట్రైబల్ కల్చరల్ ఫోరం) అవతరించింది. శ్రీ ఓండర్సన్ మావరీ, శ్రీ ఉ హిప్సన్‌రాయ్ వంటి ప్రముఖ ఖాసీ నాయకులు వారి ఆధ్యాత్మిక సాంస్కృతిక విలువలను ఉత్తేజితం చేసి అనేకమంది క్రైస్తవ ఖాసీలను తిరిగి తమ పూర్వజుల ఖాసీ పంథాలోకి తీసుకువచ్చారు. విఖ్యాతురాలైన రాణి గైడిన్లియూ 1979లో ప్రయాగలో జరిగిన విశ్వహిందూ పరిషత్

రాణీమా గైడిన్లియూ



సమ్మేళనంలో పాల్గొన్న పిమ్మట నాగాలలోని మూడు ముఖ్య శాఖలను— జోమి, రొంగోమి, జోలియాంగ్‌లను— 'హరకా' (పవిత్ర విశ్వాసం) పేర సమైక్యపరుస్తూ వారి ధార్మిక పునరుజ్జీవన ప్రజా ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్నది. భారతీయ జనజాతి సాంస్కృతిక మంచ్ యొక్క ప్రేరణ, సహకారాలతో 1981 జనవరిలో నిర్వహించబడిన 'హరకా' మహాసభ చరిత్రాత్మకంగా, అపూర్వంగా జరిగింది. 3 రోజులు జరిగిన యీ మహాసభలో అస్సాం, నాగాలాండ్, మణిపూర్ ప్రాంతాల లోని 81 గ్రామాల నుంచి 2, 000 పైగా నాగా ప్రతినిధులు పాల్గొన్నారు. "పాశ్చాత్యీకరణ మనకు మన సంస్కృతికి ముప్పు", "సాంస్కృతిక కాలుష్యంపట్ల జాగ్రత్త!" వంటి నినాదాల పోస్టర్లు ఆ సభాస్థలంలో వ్రేలాడుతూ నాగాలలో పెల్లు బికిన నవచైతన్యానికి దర్పణం పట్టాయి. వనవాసీ బాలబాలికలకు వారి వాడుకభాష లోనే భారతీయ లిపుల ద్వారా విద్య గరిపే ఒక క్రొత్త ప్రయత్నం అస్సాంలోని హాఫ్‌లాంగ్‌లో జరుగుతున్నది.

అస్సాం మైదాన ప్రాంతాలలోని వనవాసీయేతర హిందువులు కూడ 'మంచ్' పిలుపును ఆలకిస్తున్నారు. దీనితో వనవాసులకు యితరులకు మధ్య ఏర్పడ వలసిన సత్సంబంధాలను నెలకొల్పే అవకాశం ఏర్పడుతున్నది. ఈ యిరువురిని ఒకరి మీద ఒకరిని ఉసిగొల్పజూసే మిషనరీల కుతంత్రాలు యిక భగ్నమైనట్లే.

వనవాసీ కళ్యాణ ఆశ్రమం వనవాసుల ప్రాచీనమైన సాంస్కృతిక వార సత్వాన్ని వెలుగుకు తెస్తోంది. మధ్యప్రదేశ్‌లో నిర్వహించబడుతున్న రామనవమి, గోవర్ధనపూజ, ఇందల్ పూజ వంటి ఉత్సవాలకు, సాధు సన్యాసుల యాత్రలకు ఆకర్షితులై వందలకొలది గ్రామాలనుండి వేలాదిమంది వనవాసులు పాల్గొంటున్నారు. రాజస్థాన్ నుండి ఉత్తరప్రదేశ్ వరకు, బీహారు నుండి మహారాష్ట్ర, దక్షిణాన తమిళ నాడు, కేరళల వరకు అన్ని ప్రాంతాలలో ప్రారంభించబడిన స్త్రీ–శిశు సంస్కార కేంద్రాలు, పాఠశాలలు, వసతి గృహాలు, పఠనాలయాలు, ఉచిత చికిత్సాలయాలు, గ్రామీణ కుటీర పరిశ్రమలు మొదలైనవాటి సంఖ్య రానురాను పెరుగుతున్నది.

## 'మా హృదయానికి తృప్తి ఇక్కడే' :

గతంలో క్రైస్తవంలోకి మారిన వనవాసులు బీహార్, మధ్యప్రదేశ్, మహా రాష్ట్ర వంటి ప్రాంతాలలో ఈ కార్యకలాపాల ప్రభావంగా తిరిగి తమ పూర్వీకుల వారసత్వాన్ని స్వాభావికంగానే స్వీకరించారు. అనేక ప్రాంతాలలో వివిధ బాధ్యత లను నిర్వహించడానికి వందలాదిమంది వనవాసులే స్వచ్ఛందంగా ముందుకు రావడం

వనవాసీ కళ్యాణాశ్రమ కార్యంలో ఒక స్ఫూర్తిదాయకమైన విశేషం. ఇంతవరకు దేశం లోని మొత్తం 175 వనవాసీ జిల్లాలలో 91 జిల్లాలలో, 50 వేల వనవాసీగ్రామాలలో 4, 155 గ్రామాలలో కళ్యాణాశ్రమం వారి కార్యకలాపాలు చురుకుగా కొనసాగుతున్నాయి.

అయితే కళ్యాణాశ్రమ కార్యం యొక్క యదార్థ సాఫల్యత యిలా అంకెలత్తో లెక్కగట్టి కొలువదగింది కాదు. ఆ కార్యకలాపాలనన్నింటిని చైతన్యవంతం చేస్తున్న భావనాశక్తిలోనే ఆ సాఫల్యత వుంది. రెండేండ్ల క్రిందట మధ్యప్రదేశ్ లోని వనవాసీ కళ్యాణాశ్రమ కేంద్రాలను సందర్శించిన అనంతరం శ్రీ హిప్పన్‌రాయ్ మాట్లాడుతూ "ఇక్కడే మాకు సంతోషం లభించింది. అన్నిటికి మించి మా ఆలోచనలకు, మా హృదయాలకు సంతృప్తికరమైన ఉత్తేజం చేకూరింది" అని వ్యాఖ్యానించారు.

## విద్యారంగంలో భారతీయత :

విద్యలో భారతీయత్వపు తేజాన్ని నింపాలనే ఉజ్వలాశయంతో దేశమంతటా వందలాది విద్యాసంస్థలు, సమాజాలు ఆవిర్భవించాయి. వీటినన్నిటిని సమన్వయం చేసే కేంద్ర సంస్థ విద్యాభారతి. దీని మార్గదర్శకత్వంలో నర్సరీ నుండి కళాశాల స్థాయి వరకు, అనేక ఆవాస విద్యాలయాలతో సహా దాదాపు 1800 పాఠశాలలు నడుస్తున్నాయి. వీటిలో చదువుతున్న బాలబాలికలు విద్యాప్రమాణాల్లోనేకాక సంస్కారవంతమైన అనుశాసనబద్ధమైన ప్రవర్తనలో కూడ సాధారణస్థాయి కంటె ఎంతో ఉన్నత ప్రమాణాల్లో వున్నారు.

1978 ఢిల్లీ శిశుసంగంలో విన్యాసాలు చేస్తున్న చిన్నారులు



అంతర్జాతీయ బాలల సంవత్సరమైన 1978లో ఢిల్లీలో విద్యాభారతి ఆధ్వర్యంలో జరిగిన శిశుసంగమంలో ఢిల్లీ, దాని పరిసర ప్రాంతాల నుంచి 9 నుండి 11 సం॥ల వయస్సు గల 15 వేలమంది బాలబాలికలు పాల్గొన్నారు. ఈ కార్యక్రమం రాష్ట్రపతిచే ప్రారంభించబడినది. పరిమాణంలోను, అనుశాసనంలోను మున్నెన్నడూ కనివిని యెరుగని అద్భుతమైన సన్నివేశం— ఈ శిశుసంగమం. విద్యారంగపు సమస్యలను, తీరుతెన్నులను కూలంకషంగా అధ్యయనం చేయడానికి ఏర్పడిన భారతీయ శిక్షణ మండల్ అనే సంస్థ దేశమంతటిలోని ప్రముఖ విద్వాంసులు, విద్యావేత్తలు, సామాజిక శాస్త్రజ్ఞుల సహాయ సహకారాలను సమీకరించడంలోను, విద్యా సమస్యలపై సెమినార్లు, వర్కు-షాపులు నిర్వహించడంలోను, మన విద్యావ్యవస్థలో యదార్థమైన భారతీయతత్వాన్ని పూరించే ఆచరణయోగ్యమైన ప్రణాళికను రూపొందించడంలోను విజయం సాధించింది.

మన జాతీయ భాషలన్నిటికి మహాత్మక అయివుండి కూడ మృతభాషగా పరిహసింపబడుతూ వచ్చిన సంస్కృతం— బెంగుళూరులోని హిందూ సేవాప్రతిష్ఠాన్ వారు రూపొందించిన 'పది రోజుల్లో సంస్కృత సంభాషణ' నేర్పే విస్తృతమైన నవ్య ప్రక్రియ కారణంగా— నేడు జవసత్వాలను సమకూర్చుకుంటోంది. విశ్వ సంస్కృత ప్రతిష్ఠాన్ వంటి సంస్థలు కూడ ఈ కార్యక్రమాన్ని చేపడుతున్నాయి. బాలురు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు- వేలాదిమంది విద్యార్థులు ఈ శిబిరాలకు వచ్చి సంస్కృత సంభాషణ నేర్చుకొంటున్న తీరు చూస్తే ఈ ఉద్యమం రానున్న సంవత్సరాలలో మహోద్యమంగా పరిణమించగలదని నిస్సందేహంగా చెప్పవచ్చు.

## వివేకానందుని స్వప్నానికి రూపకల్పన :

1963లో వివేకానందుని శతజయంతి సందర్భంగా ఆ మహనీయుని స్మృతిని తగురీతిని శాశ్వతంగా పదిలపరిచేందుకు వివేకానంద శిలాస్మారకసమితి ఆవిర్భవించింది. కన్యాకుమారికి ఆవల సాగరమధ్యంలో చరిత్రాత్మకమైన వివేకానంద శిలపై ప్రతిష్ఠించబడిన స్మృతి మందిరం జాతికే స్ఫూర్తి కేంద్రంగా రూపొందింది. దీని నిర్మాణానికై దేశం నలుమూలలలోని లక్షలాదిమంది సామాన్యుల నుంచి స్వయం సేవకులు పెద్ద ఎత్తున నిధులు సేకరించగలగటం ఈ స్మృతిమందిరాన్ని చిరస్మరణీయం చేశాయి. అమెరికాకు లిబర్టీ విగ్రహం ఎలాంటిదో భారతదేశానికి ఈ స్మృతి మందిరం అలాంటిది. సమాజంలోని గ్రామీణ, వెనుకబడిన వర్గాల వారికి సేవ చేసే యువతీ యువకులకు శిక్షణ యిచ్చే నిమిత్తం వివేకానంద కేంద్రం అవతరించింది.



వివేకానందుని కలల పంటగా కన్యాకుమారిలో వెలసిన స్మారక కేంద్రం

ఈ కేంద్రంచే అరుణాచలప్రదేశ్‌లో నడుపబడుతున్న ఆవాస విద్యాలయాలు అచటి వనవాసీ బాలబాలికలలో సరియైన సాంస్కృతిక, ఆధ్యాత్మిక సంస్కారాలను నిర్మాణం చేయడంలో ప్రశంసనీయమైన విజయాన్ని సాధిస్తున్నాయి.

ఈ కేంద్రం ప్రోత్సాహంతో యోగవిద్యా నిపుణులు యోగ పరిశోధన, యోగచికిత్సలలో క్రొత్త అంశాలను వెలికి తీస్తున్నారు. ఇది ప్రపంచవ్యాప్తమైన ప్రాముఖ్యతను సంతరించుకునే అవకాశముంది.

## విద్యార్థి శక్తి సద్వినియోగం :

జాతీయ పునర్నిర్మాణ కార్యంలో ప్రత్యేక శ్రద్ధ వహించవలసియున్న అత్యంత కీలకమైన రంగాలలో విద్యార్థి రంగం ఒకటని వేరే చెప్పనక్కరలేదు. జాతి శ్రేయస్సుకై విద్యార్థుల తెలివితేటలను, యువశక్తిని వినియోగించడానికేగాక

వారిలో మహోన్నత భారతీయ సాంస్కృతిక విలువలను కూడ జాగృతం చేయగల విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించడానికి అఖిల భారతీయ విద్యార్థి పరిషత్ నడుంకట్టింది. విద్యార్థులు, అధ్యాపకులు, తల్లిదండ్రులు, విద్యాసంస్థల నిర్వాహకులు— ఒకే సమరస విద్యాకుటుంబంలోని సభ్యులుగా పరిగణించే పరిషత్ నేడు దేశంలోకెల్లా మిక్కిలి పెద్దదైన విద్యార్థి సంస్థగా వికసించింది.

దేశానికి 'ఇండియా' అనే పేరు తొలగించి 'భారత్' పేరును సుస్థిరం చేయాలని, హిందీని రాజ్యభాషగా ఆమోదించాలని, వందేమాతరాన్ని జాతీయ గీతంగా స్వీకరించాలని పరిషత్ 1949లో ప్రజాభిప్రాయాన్ని సేకరించింది. నేడు సువ్యవస్థితమైన సంఘటనగా రూపొందిన పరిషత్ యొక్క కార్యకలాపాలలో దేశమంతటా వేలాదిమంది విద్యార్థులు, పూర్తి సమయం పని చేసే వందలకొలది కార్యకర్తలు, ఆచార్యులు, అధ్యాపకులు చురుకుగా పాల్గొంటున్నారు. అది ప్రవేశించిన ప్రతిచోట ప్రశాంతమైన విద్యావాతావరణాన్ని నెలకొల్పడంలోను, కులాలు, వర్గాల మధ్య స్పర్థలను అంతమొందించడంలోను, గూండా శక్తుల వలన ఏర్పడిన భయావహ స్థితిని పారద్రోలడంలో కూడ గణనీయమైన విజయాన్ని సాధించింది.

జాతీయ విద్యార్థి ఉద్యమాలకు ఊపిరి విద్యార్థి పరిషత్



గ్రామ పునర్నిర్మాణంలో విద్యార్థి శక్తి వినియోగించడం, అస్పృశ్యత, వరకట్నం వంటి సాంఘిక దురాచారాలతో పోరాడేందుకు వారిని ఉత్తేజితం చేయడం పరిషత్ చేస్తున్న మరో ముఖ్యమైన కృషి. విద్యార్థులలో అఖిల భారతదృక్పథాన్ని పెంపొందించడానికి 'వివిధ ప్రాంతాల జీవనానుభూతి', 'భారతదేశం నా యిల్లు' మున్నగు కార్యక్రమాలు చేపట్టబడుతున్నాయి. ఈశాన్య ప్రాంతాలకు చెందిన పలువురు గిరిజన విద్యార్థులకు యితర ప్రాంతాలలోని కుటుంబాలతో కలిసిమెలిసి జీవిస్తూ విద్యను కూడ నేర్చుకునే అవకాశం కల్పించబడింది.

1974-75లో జరిగిన గుజరాత్, బీహార్ ఉద్యమాలలో పరిషత్ ప్రముఖమైన పాత్ర నిర్వహించడమేకాక, శ్రీ జయప్రకాష్ నారాయణ్‌ను ఉద్యమ సారథ్యానికి అంగీకరింపజేయడంలో కృతకృత్యమైంది. ఎమర్జెన్సీలో జరిగిన పోరాటంలో కూడ దాని పాత్ర గణనీయమైనది. ఆ సందర్భంగా పరిషత్ కార్యకర్తలలో 450 మంది పైగా 'మీసా' క్రింద, 4,000మంది పైగా 'డి. ఐ. ఆర్.' క్రింద నిర్బంధించబడ్డారు. అస్సాం వంటి కీలకమైన జాతీయ సమస్యలు ఉత్పన్నమైనపుడు వాటిని ప్రజల దృష్టికి తేవడంలో పరిషత్ చేసిన ప్రయత్నాలు అభినందనీయమైనవి. అస్సాం సమస్య సందర్భంగా పరిషత్ నిర్వహించిన సెమినార్లలో విఖ్యాత పత్రికా రచయితలు, విద్యావేత్తలు, సామాజిక శాస్త్రవేత్తలు, విద్యార్థినాయకులు పాల్గొన్నారు. ఆ తరువాత వారు అస్సాంను సందర్శించి సమస్యను అర్థం చేసుకొనటానికి కూడ ప్రయత్నించారు. దేశంలోని అన్ని ప్రాంతాల నుండి వచ్చిన వందలాదిమంది విద్యార్థులతో గౌహతిలో చరిత్రాత్మకమైన సత్యాగ్రహాన్ని విద్యార్థి పరిషత్ జరిపింది. అస్సాంకు చెందిన విద్యార్థి నాయకులు దేశపు యితర ప్రాంతాలలో పర్యటించే ఏర్పాటు కూడ పరిషత్ చేసింది.

## కార్మిక రంగానికి కొత్త ఒరవడి:

నేడు ప్రభుత్వపు లెక్కల ప్రకారం భారతీయ మజ్దూర్ సంఘ్ దేశంలోని కార్మిక సంస్థలలో రెండవ స్థానంలో వుంది. ఇతర ముఖ్య కార్మిక సంస్థలు ఏర్పాటయిన అనేక సంవత్సరాల తరువాత యిది రంగప్రవేశం చేసినప్పటికీ తన చిత్తశుద్ధితో, దీక్షాబద్ధమైన కృషితో ఈ ప్రత్యేకతను సాధించగలిగింది. సంస్థగా త్వరిత గతిని విస్తరించడమేకాక కార్మికోద్యమానికి ఒక మౌలికమైన విశిష్ట సిద్ధాంతాన్ని సమకూర్చడం మజ్దూర్‌సంఘ్ ప్రత్యేకత.

భారతీయ మజ్దూర్ సంఘ్ అవతరణకు పూర్వం భారతీయ కార్మిక రంగం రాజకీయవాదుల పలుకుబడి క్రింద వుండేది. గుర్తింపు పొందిన కేంద్ర కార్మిక సంస్థలన్నీ వివిధ రాజకీయ పార్టీలకు, వర్గాలకు అనుబంధంగా వుండేవి. దీనివల్ల ఆయా పార్టీల పదవుల కుమ్ములాటలో తరచుగా కార్మికులు వినియోగించుకొనబడు తుండేవారు. జాతీయ ప్రయోజనాల పరిధికి లోబడి కార్మికుల ప్రయోజనాలకు రక్షణ, అభివృద్ధి కల్పించాలని బి. ఎం. ఎస్. ప్రయత్నం. ఈ రెండు ప్రయోజనాల మధ్య వైరుధ్యమనేదే లేదని వారి దృఢ విశ్వాసం. నిజానికి పారిశ్రామిక సంబంధాలలో పాత్ర వహించే అన్ని పక్షాలు జాతీయ శరీరంలోని అవిభాజ్యమైన అంగాలే. వారి వర్గానికి సంబంధించిన ప్రయోజనాలు, జాతి ప్రయోజనాలు ఒకటే. పారిశ్రామిక సంబంధాలలో సమాజాన్ని తృతీయపక్షంగాను, మిగతా రెండింటికంటె ముఖ్యమైన పక్షంగాను బి. ఎం. ఎస్. పరిగణిస్తుంది. వినియోగదారుల హిత రక్షణయే ఆర్థికంగా జాతికి శ్రీరామరక్ష అని అది భావిస్తుంది.



కార్మికులారా ప్రపంచాన్ని ఏకం చెయ్యండి

శ్రీ దత్తోపంత్ ఠేంగ్డీ



మన భారతీయ సాంస్కృతిక భావనకు అనుగుణ్యంగా బి. యం. యస్. వ్యవహరిస్తూ, సమాజంలో శాశ్వతమైన విభజనకు, కలహాలకు దారి తీసే వర్గ సంఘర్షణ సిద్ధాంతాన్ని తిరస్కరించి, 'పారిశ్రామిక కుటుంబం' అనే సమరస సూత్రాన్ని వ్యాప్తి చేసింది. మన తాత్త్విక దృక్పథానుసారం 'పనిచేసే హక్కు'ను ప్రాథమిక హక్కుగా గుర్తించాలని డిమాండు చేసింది. కార్మికులు యజమాని-సేవకులు అనే సంబంధం నుండి కార్మికులు యజమానులయ్యేస్థితికి పురోగమించాలని పిలుపు యిచ్చింది.

కార్మికులలో విధి నిర్వహణా ప్రవృత్తి, క్రమశిక్షణ, దేశభక్తి, నైతికత, సత్ప్రవర్తన నెలకొనేలా చేయడంలో బి. ఎం. ఎస్. సాధించిన ఫలితం నిజంగా ఒక అద్భుత విజయం. ప్రాచీన భారతీయ యితిహాసాల ప్రకారం 'విశ్వకర్మ' గొప్ప నిర్మాత విశ్వశిల్పి అని తెలియవస్తున్నది కనుక సెప్టెంబరు 17వ తేదీని "విశ్వకర్మ దివస్" పేర జాతీయ కార్మిక దినోత్సవంగా జరపాలనే ఆలోచనను కార్మికులలో వ్యాప్తి చేయడం, ఎర్రజెండా స్థానే మన పరంపరానుగతమైన కాషాయ ధ్వజాన్ని స్వీకరించడం వంటి సాహసోపేతమైన చర్యలతో బి. ఎం. ఎస్. కార్మికోద్యమంలో ఒక విశిష్టమైన జాతీయ పైఖరిని నిర్మాణం చేసింది.

## వివిధ రంగాలకు కొత్త ఊపిరి :

ఉత్తరప్రదేశ్‌లో దీనదయాళ్ పరిశోధనా సంస్థ చేపట్టిన గోండా ప్రాజెక్టు విషయం జగద్విదితమే. ఆదర్శప్రేరితులైన కార్యకర్తల బృందం సహాయంతో పాలనా యంత్రాంగానికి గ్రామీణ ప్రజలకు మధ్య సంబంధాలను పటిష్ఠం చేయగలిగితే ప్రణాళికలను అమలుచేయడంలో ప్రజలు స్వయంగా ఎంత ఉత్సాహంతో పాల్గొనగలరో తద్వారా ఎంత ఆశ్చర్యకరమైన ఫలితాలు సాధించవచ్చునో అది నిరూపించింది. మూడు సంవత్సరాల స్వల్పవ్యవధిలో ఆ జిల్లాలలోని $2\frac{1}{2}$ లక్షల ఎకరాల భూమి గొట్టపుబావుల ద్వారా సేద్యం క్రిందికి తీసుకొని రాబడింది. దీనితో రైతులు యేడాదికి రెండు మూడు పంటలు వేయగలగడం తద్వారా 1039 గ్రామాలలోని 93 వేల కుటుంబాలు ప్రయోజనం పొందటం సాధ్యమైంది. అలాగే చెట్లు నాటే కార్యక్రమం క్రింద రెండు సంవత్సరాల వ్యవధిలో 2 లక్షల 23వేల చెట్లు నాటగలిగారు. అంత్యోదయ కార్యక్రమం క్రింద పాడి పశువులను యివ్వగా 1, 439 నిరుపేద కుటుంబాలకు జీవనాధారం లభించింది.

సాహిత్య క్షేత్రం కూడ విస్మరించబడలేదు. 1947లో ప్రారంభించబడిన

లక్నో రాష్ట్రధర్మ ప్రకాశన్ ఈ కృషికి నాంది పలికింది. బెంగుళూరు రాష్ట్రోత్థాన సాహిత్యవారు 5101 మంది భారతమాత ముద్దుబిడ్డల జీవితచరిత్రలు భారత-భారతి పుస్తకాలుగా వెలువరించారు. ఒక కోటికి పైగా ప్రతులు కన్నడంలో వెలువరించబడినై. వాటి ఇంగ్లీషు, హిందీ, మరాఠీ అనువాదాలు కూడ విశేషంగా ప్రజాదరణను పొందినై. ఢిల్లీ "సురుచి సాహిత్య", హిందూదేశ చరిత్రను పునఃరచించే ప్రత్యేకమైన లక్ష్యంతో పని చేస్తున్న "బాబాసాహెబ్ ఆప్టే స్మారకసమితి, నాగపూరు", చిత్రకథామాలను ప్రచురిస్తున్న రాజస్థాన్ జ్ఞానగంగా ప్రకాశన్, పూనె, నాగపూర్‌లలో గల భారతీయ విచార సాధన వంటివి అఖిల భారత స్థాయిలో సాహసోపేతమైన ప్రచురణలకు పూనుకుంటున్న ప్రధాన సంస్థలలో కొన్ని. ఆంధ్ర ప్రాంతంలో 'నవభారతి' ప్రచురణ సంస్థ జాతీయ భావాలనుజాగరితం చేసే అనేక పుస్తకాలను ప్రచురించింది. ఇట్టివే ఎన్నో ప్రచురణ సంస్థలు జాతీయ, సాంస్కృతిక, చారిత్రిక అంశాలపై సాధికారికమైన పుస్తకాలను, పత్రికలను వెలువరిస్తున్నాయి.

వివిధ భాషలలో, మాండలికాలలో వందలాదిగా జాతీయ గీతాలను ప్రాచుర్యంలోకి తీసుకొని రావటం, సమున్నతమైన దేశభక్తి భావనలను, సాంస్కృతిక విలువలను లక్షలాది హృదయాలలో ఉత్తేజితం చేయటం వంటివి– జాతీయ పునర్నిర్మాణ కృషిలో మరొక భావప్రపూరితమైన పరిణామం.

కొందరు స్వయంసేవకులు పత్రికా రంగంలో కూడ ప్రవేశించారు. వీరు అనేక సంస్థలుగా ఏర్పడి అన్ని ప్రధాన భాషలలోను సరియైన జాతీయ దృక్పథంతో విషయాలను విశదీకరించే దినపత్రికలు, వారపత్రికలు, మాసపత్రికలు మొదలైనవి వెలువరిస్తున్నారు.

ఢిల్లీ సేవాభారతి హరిజన బస్తీలో నిర్వహించిన సామూహిక భోజన కార్యక్రమం



పట్టణాల్లోను, గ్రామీణ ప్రాంతాల్లోను కూడ ఉపేక్షిత వర్గాలకు సేవ చేసే కార్యక్రమం త్వరితంగా విస్తరిస్తున్నది. గుడిసెవాసుల కోసం ఢిల్లీలోని సేవాభారతి యిప్పటికి 150 పైగా పథకాలను అమలు చేసింది. బెంగుళూరులోని హిందూసేవా ప్రతిష్ఠాన్ పిలుపుకు పెద్ద సంఖ్యలో యువతీ యువకులు హిందూ మిషనరీలుగా పూర్తి సమయమిచ్చి పని చేయడానికి ముందుకు వచ్చారు. వ్యక్తిగత సంపర్కం ద్వారాను, పత్రికా ప్రకటనల ద్వారాను ఈ సంస్థ గత 5 సంవత్సరాలలో రెండు వందలమంది పూర్తి సమయపు కార్యకర్తలను ఎంపిక చేసి, శిక్షణయిచ్చి– విద్య, శిశుపోషణ, యోగశిక్షణ, ఆరోగ్యాభివృద్ధి, మాతాశిశువులకు 'సంస్కార కేంద్రాలు'– వంటి విభిన్న కార్యాలకు వారిని వినియోగించింది.

మధ్యప్రదేశ్‌లో చంపాలోని భారతీయ కుష్ఠు నివారక సంఘ్ కుష్ఠు రోగులకు స్వస్థత చేకూర్చడంలోను, ప్రజల మనస్సులో ఈ వ్యాధి పట్ల వున్న దురభిప్రాయాలను, భయాలను పారద్రోలి వారికి సమాజంలో పునరావాసం కల్పించడంలోను నిరుపమానమైన సేవలు చేస్తున్నది.

రైతు ఉద్యమాలను విజయవంతంగా నిర్వహిస్తున్న భారతీయ కిసాన్ సంఘ్



భారతీయ కిసాన్ సంఘ్ రైతు వర్గాన్నంతటిని ఒకే కుటుంబంగా పరిగణించే మరో అఖిల భారత సంస్థ. రైతులకు విద్య గరిపే కార్యక్రమాలు నడపడమే కాక వివిధ సమస్యలపై రైతు ఉద్యమాలను విజయవంతంగా నిర్వహిస్తున్నది. ఏ రాజకీయ పక్షానికి చెందని, ఎట్టి స్వార్థ ప్రయోజనాన్ని ఆశించని కిసాన్ సంఘ్ ఏడేండ్ల క్రిందట మాత్రమే స్థాపించబడినప్పటికి, ఇప్పటికే దాదాపు అన్ని ప్రాంతాల లోను నిలద్రొక్కుకొనగలిగింది.

కొన్ని పట్టణాలలో వినియోగదార్ల ఉద్యమం కూడ ప్రారంభమై అవినీతి పరులైన వ్యాపారులు, ఉత్పత్తిదార్లు కలిసి వినియోగదార్లకు చేస్తున్న అన్యాయాన్ని ప్రతిఘటిస్తూ ప్రజాదరణను పొందుతున్నది.

డాక్టర్‌జీ జీవించివున్న రోజులలోనే ఒక మహిళా సంఘటనను ప్రారంభించే విషయంతో 1936లో శ్రీమతి లక్ష్మీబాయి కేల్కర్ (మౌసీజీ) వారిమార్గదర్శనాన్ని కోరింది. మహిళా సంస్థలకు ఎదురయ్యే సమస్యలను డాక్టర్‌జీ ఆమెకు వివరించి కొన్ని ప్రయోజనకరమైన సలహాలు యిచ్చారు. శ్రీమతి మౌసీజీచే స్థాపించబడిన రాష్ట్ర సేవికాసమితి హిందూ స్త్రీలలో శారీరిక క్షమత, ధైర్యసాహసాలు, శక్తి సామర్థ్యాలు, హిందూ సంస్కృతీ పరంపరల పట్ల అవగాహన, హిందూ స్త్రీత్వపు ఆదర్శాల పట్ల శ్రద్ధతో కూడిన తత్పరత మున్నగు సద్గుణాలను పెంపొందించడంలో విశేష కృషి చేస్తున్నది. అనుశాసనబద్ధంగా సమష్టి కృషితో నిర్వహించబడుతున్న నిత్య కార్యక్రమాల ద్వారా ఈ సమితి నేడు ఒక అఖిల భారతోద్యమంగా విస్తరించి హిందూ స్త్రీత్వాన్ని పాశ్చాత్య నాగరికత యొక్క దుష్ప్రభావం నుండి సంరక్షించ డానికి కటిబద్ధమై వుంది.

**మహిళలీ సమాజంలో సగభాగమంటూ పథసంచలనం జరుపుతున్న వరంగల్ సేవికలు**



## రెడీ ఫర్ సెల్ఫ్‌లెస్ సర్వీస్ :

ప్రకృతివల్ల గాని, మానవకృతంగాగాని ప్రజలకు ఎప్పుడు ఎక్కడ ఏ ఉపద్రవం వాటిల్లినా బాధితులను ఆదుకొనడానికి స్వయంసేవకులే సహజంగా అందరికంటె ముందు చేరగల్గుతున్నారు. 1950లో తూర్పు పాకిస్తాన్ నుండి గెంటబడి శరణార్థులుగా భారతదేశానికి వచ్చిన సోదరీ సోదరుల కోసం బెంగాల్‌లో ఏర్పడిన 'వాస్తుహార సహాయతాసమితి' చిరస్మరణీయమైన సేవ చేసింది. దేశమంతటి నుండి పెద్ద యెత్తున సేకరించిన ధనము, దుస్తులు, వంటపాత్రలు మొదలైనవి శరణార్థులకు పంచింది. 1955లో పంజాబ్‌లో అనేక ఆనకట్టలకు గండ్లు పడి, ఆరు జిల్లాలు మునిగిపోయే స్థితి ఏర్పడినప్పుడు జవాన్ల కంటె స్వయంసేవకులే ముందుగా ఆ ప్రదేశాలకు చేరుకొన్నారు. కర్నాల్‌లోని 11 డామ్‌లను వారు మరమ్మతు చేశారు. 15, 000 యిసుక బస్తాలను అడ్డు వేసి పానిపట్టులోకి చొచ్చుకువస్తున్న జలప్రవాహాన్ని నిరోధించారు.

1977 నవంబరులో ఆంధ్ర తీరప్రాంతాన్ని తాకిన భయంకరమైన తుఫాను తాకిడికి అనేక వేలమంది మరణించగా, మరి కొన్ని వేలమంది నిరాశ్రయులైనారు. ఆ సమయంలో సంఘం చేపట్టిన సహాయ కార్యక్రమాలను జాతీయ పత్రికలన్నీ వేనోళ్ళ ప్రస్తుతించాయి. మద్రాసు నుంచి 'హిందూ' పత్రిక యిలా వ్రాసింది ! "ఆర్. యస్. యస్. కార్యకర్తలు యిప్పటికే ఆంధ్రగ్రామాలలో నిశ్శబ్దంగా సహాయ కార్యక్రమాలలో నిమగ్నమై వున్నారు. తమ నాయకులు యిచ్చిన పిలుపు వింటూనే దేశంలోని విభిన్నప్రాంతాలకు చెందిన ఈ యువతీయువకులు ఈ ప్రాంతం తమ నివాసాలకు సుదూరంగా వున్నప్పటికీ, తమ ఆదర్శానికి యీ కార్యం సన్నిహితమైనందున, తమ అంతరాత్మ ఆదేశంతో ప్రేరితులై నిస్వార్థ సేవ చేయడానికి యిక్కడకు చేరుకున్నారు. సహాయ కార్యక్రమాలు నిర్వహిస్తున్న వారిలో వీరిని నిజమైన వీరులుగా పేర్కొనవచ్చు...." ఆంధ్రప్రదేశ్ సర్వోదయ నాయకుడు శ్రీ ప్రభాకర్‌జీ సంఘం చేసిన కృషిని చూసి ఎంతగానో ముగ్ధులై "ఆర్. యస్. యస్. అంటే రెడీ ఫర్ సెల్ఫ్‌లెస్ సర్వీస్" అని ప్రశంసించారు. అనంతరం తుఫాను బాధితుల కోసం "దీనదయాళపురం" పేర ఆదర్శ గ్రామం వెలిసింది. అలాంటివే మరి మూడు గ్రామాలు— శ్రీరామ్‌నగర్, మాధవనగర్, కేశవపురి అనేవి నిర్మించి బాధితులకు అందజేసింది సంఘం.



మోర్వీ వరద బీభత్సం తర్వాత శవాలను తొలగిస్తున్న సంఘ కార్యకర్తలు

తిరిగి 1979లో గుజరాత్‌లో మోర్వీ డామ్ పగిలిపోయినప్పుడు అందరి కంటె ముందు స్వయంసేవకులే సహాయ చర్యలు ప్రారంభించారు. 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ'లో శ్రీ యం. వి. కామత్ యిలా వ్రాశారు: "మీరు ఆర్. యస్. యస్. గురించి ఏమైనా అనండి. కాని తమ సోదర ప్రజలకు సేవ చేయడంలో మాత్రం ఏ క్షణంలోనైనా చొక్కాలు మడిచి వెంటనే పనిలోకి దిగడానికి వారు సంతోషంగా సంసిద్ధంగా కనిపిస్తారు. తమ పనికి ఏ మాత్రం ప్రతిఫలాన్ని కోరుకోరు— కనీసం 'వీక్లీ'లో బొమ్మ వేయమని అయినా అడగరు. మీ చేతనైన మేరకు వారిని నిందించండి. కాని ఎప్పుడన్నా ఒకమారు కాస్త ఆగి వారు చేసిన సేవలకు ధన్యవాదాలు చెప్పండి."

భోపాల్‌లో గ్యాసు ప్రమాదం సందర్భంగా అత్యవసర వైద్య సహాయాన్ని, ఇతర సహాయ కార్యక్రమాలను అందించడంలోను, శవాలను తొలగించి అంత్య క్రియలు నిర్వహించడంలోను స్వయంసేవకులు ప్రముఖపాత్ర వహించారు. మిగిలి పోయిన గ్యాసును నిశ్శేషంచేసే కార్యక్రమం ప్రారంభం కావలసివున్నరోజున అందరూ పట్టణం విడిచిపోగా పోలీసులు, సైనికులతోపాటు స్వయంసేవకులు మాత్రమే కర్మా

గారం వద్ద, నగరంలోని యితర ప్రదేశాలలోను రక్షణ విధులు నిర్వహిస్తూ నిలిచారు.

1984 నవంబరులో శ్రీమతి ఇందిరాగాంధి హత్య సందర్భంగా ఢిల్లీలో సిక్కులపై పెద్ద యెత్తున హత్యలు, లూటీలు, గృహదహనాలు ప్రారంభించబడటం చూసి జాతి యావత్తు దిగ్భ్రాంతి చెందింది. అధికారపార్టీ కార్యకర్తలు స్వయంగా హంతకుల గుంపులను ప్రోత్సహించి పర్యవేక్షిస్తుండగా, మరొకవంక పోలీసులు నిస్సహాయంగా చూడడమో లేక అత్యాచారాలకు అండగా నిలవడమో చేయగా వంద లాది మంది సంఘ స్వయంసేవకులు తమ ప్రాణాలను సైతం తెగించి ముందుకు వచ్చి భయగ్రస్తులై వున్న సిక్కులకు ఆశ్రయాన్ని, రక్షణను యిచ్చారు. సిక్కు లతో సహా హిందూ సమాజంలోని అన్ని వర్గాల మధ్య నున్న అనుబంధం ఛేదించ రానిదనే స్వయంసేవకుల నమ్మకానికి అది నిజంగా ఒక అగ్నిపరీక్ష. ఆ పరీక్షను వారు తట్టుకొని నిలిచారు.

## దూరతీరాలకు తాకిన హిందూ తరంగం :

దూరదేశాలకు వెళ్ళిన స్వయంసెవకులు సహితం తమ కర్తవ్యాన్ని విస్మ రించలేదు. సంఘం నుండి గ్రహించిన మహత్తరమైన హిందూ సాంస్కృతిక ఆధ్యాత్మిక వారసత్వం నుంచి పుణికిపుచ్చుకొన్న చైతన్యంతో వారు స్థానిక భార తీయులను సంఘటితం చేస్తూ వ్యక్తిగా, కుటుంబ సభ్యుడుగా, సామాజిక స్పృహ కల పౌరుడుగా హిందువుల ఆదర్శము ఎలాంటిదో స్థానికులకు నిరూపిస్తున్నారు. అమె రికాలోని విశ్వహిందూ పరిషత్, ఇంగ్లండులోని హిందూ స్వయం సేవక సంఘ్, కెన్యాలోని భారతీయ స్వయంసేవక్ సంఘ్, ఆగ్నేయాసియా దేశాలలోని సనాతన ధర్మసభ వంటి సంస్థలు ఈ దిశలో చెప్పుకోదగ్గ కృషి చేశాయి. 1984 జులైలో న్యూయార్కులో జరిగిన చరిత్రాత్మకమైన విశ్వహిందూ సమ్మేళనానికి 25 దేశాల నుండి 4, 000 మంది ప్రతినిధులు వచ్చారు. స్వామి చిన్మయానంద, స్వామి ఈశ్వరానందగిరి, డా॥ కరణ్‌సింగ్, డా॥ గోపాల్‌సింగ్ మరెందరో హిందూ ధార్మిక, సామాజిక నాయకులు పాల్గొన్న ఈ సమ్మేళనం ఆ దేశంలో చిరస్మరణీయమైన సన్నివేశంగా నిలిచిపోయింది.

1984 ఆగస్టులో బ్రాడ్ ఫోర్డ్ యూనివర్శిటీ ప్రాంగణంలో హిందు స్వయంసెవక సంఘ్ నిర్వహించిన మూడు రోజుల 'హిందూ సంగమ్' శిబిరంలో ఇంగ్లండు అంతటి నుండి భారతీయ యువకులు వచ్చి పాల్గొన్నారు. విభిన్నహిందు

వర్గాలలో సమైక్య హిందూత్వ చైతన్యాన్ని కలిగించడంలో ఈ శిబిరం విజయవంతమైంది. యువకులకు సంఘం నేర్పే క్రమశిక్షణ, సంస్కారవంతమైన ప్రవర్తన, శ్రమించి పనిచేసే కార్యతత్పరత మొదలైనవి చూసి ఇంగ్లీషు ప్రముఖులు కూడ హృదయపూర్వకంగా ప్రశంసించారు. రాజప్రతినిధి లార్డ్ లెఫ్టినెంట్ శ్రీ విలియం బుల్మర్, ఇద్దరు ఎం. పిలు, కొన్ని వందలమంది ఆంగ్లేయ స్త్రీ పురుషులు హిందువుల 'వసుధైవ కుటుంబకమ్' అనే విశిష్టాదర్శానికి ఘనమైన నివాళులర్పించారు. స్థానికంగా వున్న వివిధ జాతీయుల మధ్య సామరస్యాన్ని నిర్మించే కీలకమైన పాత్రను హిందూ స్వయం సేవకసంఘ్ నిర్వర్తించగలదనే విశ్వాసాన్ని వారు వ్యక్తం చేశారు. సంఘ స్వయంసేవకులు ప్రదర్శించిన ఆదర్శవంతమైన క్రమశిక్షణకు, హుందాతనానికి తన హృదయపూర్వక అభినందనలు అందించడానికి బ్రాడ్‌ఫోర్డు నగర చీఫ్ పోలీస్ ఇన్‌స్పెక్టర్ సంఘ శిబిరానికి వచ్చారు.

కెన్యాలో భారతీయ స్వయంసేవక సంఘ్ ఆయా సమయాల్లో చేపడుతున్న సహాయ చర్యలను, అది నిర్వహిస్తున్న సేవా కార్యక్రమాలను దేశాధ్యక్షుడు శ్రీ జోమో కెన్యాటా మనస్ఫూర్తిగా ప్రశంసించారు. కెన్యాలోని 80కిపైగా హిందూ సంస్థలకు సమైక్యవేదికగా ఉన్న 'యునైటెడ్ హిందూ కౌన్సిల్ ఆఫ్ కెన్యా'కు ప్రభుత్వం గుర్తింపు యివ్వడమేకాక, ఆ సంస్థ యొక్క విజ్ఞప్తి మేరకు దీపావళిని జాతీయ సెలవు దినంగా కూడ ప్రకటించింది.

## హిందూ చైతన్య శుభోదయం :

సంఘ్ స్వయంసేవకులు సంపూర్ణ జాతీయ పునరుజ్జీవన లక్ష్య సాధనకై పని చేస్తున్న ప్రధాన క్షేత్రాలలో యివి కొన్ని. జాతి మనస్తత్వంలో పరివర్తన తేవడంలో కూడ వీటన్నిటి సమిష్టి ప్రభావం రానురాను స్పష్టంగా కనిపిస్తున్నది. శతాబ్దాల ఆత్మవిస్మృతి అనే నిద్ర నుండి హిందూసమాజం నేడు మేలుకొంటున్నదని, హిందూ ఆలోచనా పద్ధతులలో ఆత్మగౌరవం, ఆత్మ విశ్వాసాలనే కొంగ్రొత్త పవనాలు వీస్తున్నాయనే వాస్తవాన్ని ఎంత నిరాశావాది అయినా నేడు కాదనలేడు.

కాని సంఘం ప్రారంభించబడిన సమయంలో ఈనాడు కన్పిస్తున్న అనుకూల పరిస్థితి ఏర్పడగలదని ఎవరైనా ఊహించగలిగి వుండేవారా?

—విరాట్ హిందూ సమాజ్, హిందూసమాజోత్సవ్, విశాల హిందూ సమ్మేళన్‌వంటి పేర్లతో హిందువుల ఐక్యతకై యిచ్చిన పిలుపుకు జమ్మూ, ఢిల్లీప్రాంతాల నుండి కేరళ, తమిళనాడుల వరకూ లక్షలాదిమంది ప్రతిస్పందిస్తున్నారు.

—ఎన్నో సంప్రదాయాలు, కులాలు–ఉపకులాలు, భాషలు–మాండలికాలు, ఆచార వ్యవహారాలు, నమ్మకాలు, ఆహారపుటలవాట్లు, వేషధారణలు ఉన్నప్పటికి హిందువులు ఒక్క త్రాటిపై నిలిచి ఐకమత్యాన్ని అభివ్యక్తం చేయగలుగుతున్నారు.

—మతోన్మాదులని, సంకుచిత స్వభావులని యిత్యాది కుత్సితమైన ఆరోపణలు యిక ఎంతమాత్రం హిందువులపై రుద్దడం వీలుపడదు. పైగా హిందుత్వం మీద వారి హృదయాలలో అభిమాన తరంగాలు ఉప్పొంగిపడుతున్నాయి.

—ఇన్ని సంవత్సరాలుగా అన్నిటికి తలవంచేవాడుగా బలహీనుడుగా పేరు పొంది ఎల్లప్పుడు అవమానాలను దిగమింగేవాడుగా పడి వున్న హిందువు యిప్పుడు ఆ స్థితిలో లేడు.

—సగటు హిందువు ఒక పిరికివాడంటూ గాంధీజీ చేసిన మదింపు ఇకపై చెల్లదు. హిందువు తన వ్యతిరేక శక్తుల ఆట కట్టించగలుగుతున్నాడు.

—హిందువులు తమ స్వత్వాన్ని, సత్తువను ప్రకటించగలుగుతున్నారు. విద్య, ప్రార్థనా స్థలాల నిర్వహణ, కుటుంబ నియంత్రణ, వ్యక్తిగతచట్టాల అమలు మొదలగు విషయాలలో హైందవేతరుల పట్ల చూపబడుతున్న సంతృప్తీకరణ పై ఖరిని, తమ పట్ల చూపుతున్న వివక్షతను రూపుమాపవలసిందిగా హిందువులు అడుగుచున్నారు.

హైందవేతర మతాలవారు కొనసాగిస్తున్న జాతి వ్యతిరేక మతాంతరీకరణ పథకాల నుండి బలహీనవర్గాలను రక్షించే చట్టం కోసం, అలాంటి మతాంతరీకరణ కార్యకలాపాల కోసం విదేశాల నుండి వస్తున్న ధనప్రవాహాన్ని అరికట్టే చట్టం కోసం హిందువులు ఒత్తిడి చేస్తున్నారు.

—స్వామి వివేకానంద శిలాస్మారక ప్రతిష్ఠను నిరోధించడం, నీలక్కల్ వద్ద చర్చిని స్థాపించడం వంటి క్రైస్తవుల దురాక్రమణ వ్యూహాలను వారు చిత్తు చేయగలుగుతున్నారు. శ్రీరామ జన్మభూమి వంటి జాతీయ వారసత్వపు శ్రద్ధా కేంద్రాల పునరుద్ధరణకై బ్రహ్మాండమైన ప్రజోద్యమాలు నడపగలుగుతున్నారు.

—తమిళనాడులోని వెల్లూరులో పాడు పెట్టబడి, శతాబ్దాల తరబడి హిందువులకు అందుబాటులో లేకుండ వుంచబడిన విఖ్యాత జలకంఠేశ్వరాలయంలో ప్రాచీన శివలింగాన్ని వారు పునఃప్రతిష్ఠించి తిరిగి తమ స్వంతం చేసుకొనడంలో విజయం సాధించగలిగారు.

—హిందూ వ్యతిరేక రాజకీయ, మతశక్తులు తమకు చేస్తున్న అన్యాయాన్ని సరిదిద్దడానికి ఈ జాగృతి హిందూ చైతన్యం తమిళనాడు కేరళలలో హిందూ

ముణ్ణనిగా, ఇతర ప్రాంతాలలో హిందూ మంచ్, హిందూహితరక్షణసమితి, హిందూ వాహిని వంటి పోరాట వేదికల రూపంలో అవతరించింది.

హిందువుల భావాలకు, హిందూ ప్రయోజనాలకు నష్టం వాటిల్లే రీతిలో మతోన్మాద హైందవేతర వర్గాలను తృప్తిపరచబూనేముందు రాజకీయవేత్తలు ఒకటికి రెండు మార్లు ఆలోచించే విధంగా రాజకీయాలపై 'హిందూ ముణ్ణని' ప్రభావం ప్రసరించగలుగుతున్నది.

—ఒకప్పుడు దుర్భరమైన రీతిలో అంటరానితనానికి నెలవై స్వామి వివేకానందునిచే 'ఉన్మాదుల ఆశ్రమం' గా పేర్కొనబడిన కేరళ వంటి ప్రాంతంలో నేడు అస్పృశ్యత జాడలే కనిపించడం లేదు. ఒకనాడు మూడు వైపుల నుంచి ముస్లింలు, క్రైస్తవులు, కమ్యూనిస్టుల దాడులకు గురియై అంతరంగికంగా కుల స్పర్థలలో చిక్కుకొని, ఆశ వదలుకొన్న హిందూ సమాజం నేడు ఆ శక్తులన్నిటిని ఎదిరించి దృఢంగా నిలబడగలుగుతున్నది. ఒకప్పుడు ప్రజలను ఆకట్టుకున్న కమ్యూనిస్టుల ప్రభావం నేడు హిందూ ఆదర్శ ప్రభావం ముందు నిలువలేక క్షీణిస్తున్నది.

—తమిళనాడులో ద్రవిడ వేర్పాటువాదం వంటి విచ్ఛిన్నకర విషసిద్ధాంతాలను జాగృత హిందూ చైతన్యం విజయవంతంగా నిర్వీర్యం చేయగలుగుతున్నది.



**అడుగడుగున ధ్యేయనిష్ఠ, మదిలో కర్తవ్యనిష్ఠ**
**జాతీయ పథాన ముందు ముందుకు సాగడమే దీక్ష**

—సంఘ శిబిరాలలో వేలకు వేలమంది పాల్గొంటున్నారు. పూనేలో 35 వేల మంది, బెంగుళూరులో 21 వేలమంది అనుశాసనబద్ధులై దీక్షాదక్షులైన యువకులు పూర్తి యూనిఫారంలో పాల్గొని జాతి యువతలో అంతర్లీనంగా ఉన్న ఉజ్వల దేశ భక్తిని, లక్ష్యానురక్తిని ప్రదర్శించారు. ఇటీవలి కాలంలో జరిగిన కొన్ని రాజకీయ యువజనోత్సవాలలో యువకులు ప్రవర్తించిన తీరువల్ల, వారి విశృంఖలత్వం వలన యువకులు సమాజానికి ఉపద్రవకారులవుతున్నారనే సాధారణఅభిప్రాయంఏర్పడుతూ ఉంటే, అది అబద్ధమని సంఘ శిబిరాల్లో పాల్గొన్న యువకులు నిరూపించారు. సంఘం నుండి స్ఫూర్తి పొందిన యితర సంస్థలు, వేదికలు నిర్వహించే బ్రహ్మాండమైన ప్రజాకార్యక్రమాల్లో సహితం యిట్టి అనుశాసనము, హుందాతనము కనిపిస్తున్నాయంటే దీని ప్రభావం సాధారణ ప్రజల మీద కూడ క్రమంగా ప్రసరిస్తుందనేది స్పష్టం అవుతున్నది.

పెల్లుబుకుతున్న హిందూ చైతన్య తరంగం యొక్క అద్భుత ప్రభావం నేడు సర్వత్రా కనిపిస్తున్నది. చెప్పడానికి దీనిని గుర్తించి చాటని ప్రముఖమైన పత్రిక లేకపోవడమే దీనికి ఋజువు.

'ఇలస్ట్రేటెడ్ వీక్లీ' సంపాదకుడు 1984 ఫిబ్రవరి 12 సంచికలో యిలా వ్రాశారు. "భారతదేశం అద్భుతమైన ప్రగతి సాధించడానికై ఒక చైతన్యవంత ఆదర్శం అవసరమని రాజకీయ వర్గాలలో పదేపదే వినవస్తున్నది. ఒక ఉజ్వల ఆదర్శానికి జాతి కట్టుబడితేనే ప్రగతి పథాన అది పయనించగలదని చెప్పడం తరచుగా మనం వింటూనే వున్నాం. హిందుత్వం యిందుకు ఉపకరించగలదని పలువురు అభిప్రాయపడుతున్నారు. ఇటీవల కొద్ది నెలలుగా హిందుత్వంమీద చర్చ విస్తృతంగా జరుగుతున్నది. ఈ ప్రతిపాదన చేస్తున్నది యిప్పుడు ఒక ఆర్. యస్. యస్. మాత్రమే కాదు. మరెందరో– ఆలోచనాపరులు, మేధావులు, సంస్థలు, రాజకీయ నాయకులు ఈ ప్రతిపాదననే చర్చిస్తున్నారు."

## జాతి నరనరాన నవోత్తేజం :

జాతి వైఖరిలో వచ్చిన ఈ మహా పరిణామం నేడు సూచించేదేమిటి?

మనకు సరియైన జాతీయాదర్శం హిందూ రాష్ట్ర ఆదర్శమేనని, ఈ జాతి యొక్క సమగ్రతకు, భద్రతకు, వైభవానికి ప్రాతిపదికగా హిందూ సంఘటన అనివార్యమని సంఘం ఈ అరవై సంవత్సరాలుగా చెప్తూ వచ్చిన మాటల్లోని సత్యాన్ని సాధారణ హిందూ ప్రజానీకం గ్రహించారు.



దండ ప్రదర్శన నిస్తున్న స్వయంసేవకులు

రెండవది— ఈ ఆదర్శాన్ని జాతీయ జీవనం యొక్క వివిధ రంగాలలో సమర్థులైన వ్యక్తులను నిర్మాణం చేయటం సంఘ శాఖల ద్వారా సాధ్యమవుతుందని కూడ ప్రజలు గుర్తించారు.

60 సంవత్సరాల క్రిందట నాగపూర్‌లో చిన్న సెలయేటిలా బయలుదేరిన ఈ సంస్థ నేడొక మహాస్రవంతిగా పెల్లుబుకుతూ వేలాది పిల్లకాలువలతో జాతీయ జీవనం యొక్క ప్రతి రంగంలోను అసంఖ్యాకమైన కార్యకలాపాలను పోషించే స్థితికి చేరుకున్నదనే వాస్తవానికి దేశం యావత్తు సాక్షిగా వుంది.

జాతి జీవనంలో ఈ వెలుగును, వేడిమిని విరజిమ్ముతున్న శక్తి కేంద్రాలు ఇప్పటికే దేశమంతటా దాదాపు 20, 000 స్థలాలలో వున్న శాఖలు— సమాజంలోని అన్ని వర్గాలలో అన్ని స్థాయిలలో వేగంగా విస్తరిస్తున్నాయని కూడ స్పష్టమవుతున్నది.

ఏమిటి ఈ కేంద్రాలు? ఏమిటి యిందులోని విశేషం?——

ఇక్కడ కులము—వర్గము, స్పృశ్యత—అస్పృశ్యత, పట్టణ—గ్రామీణ, ధనిక—పేద, చదువుకున్న—చదువురాని, గిరిజన—గిరిజనేతర— యిత్యాది విభేదాలన్నీ నమసిపోయి, సామరస్యపూర్వకమైన హృదయాల సమైక్యత జనిస్తున్నది;

ఇక్కడ విశుద్ధ శీలవంతులు, అపార శ్రద్ధాన్వితులు, అసమాన అనుశాసన బద్ధులు అయిన వ్యక్తులు మలచబడుతున్నారు; వీరు జాతి జీవనంలోని విద్వేష, స్వార్థాలను దగ్ధం చేసి త్యాగ, సేవాభావనలను ఎల్లెడల నింపుతున్నారు; దీని ఫలితంగా 'సంఘ స్వయంసేవక్' అనే మాట ప్రజల మనస్సులో పరిపూర్ణమైన శ్రద్ధా, విశ్వాసాలకు ప్రతీక అయింది.

మానవోత్తములుగా పేర్కొనదగిన యీ వ్యక్తులను ప్రేరేపించేది ప్రాచీన హిందూ మహర్షులు, ద్రష్టలు ఆకాంక్షించిన జగత్కళ్యాణ కార్యం– సర్వత్రా పరివ్యాపించియున్న పరమాత్మ యొక్క ఉనికిని సకల మానవాళి చేత గుర్తింపజేసి తద్వారా సర్వమానవ సౌభ్రాతృత్వపు ఆధ్యాత్మిక బంధాన్ని పటిష్ఠం చేసే కార్యం– మానవుని శారీరిక, మానసిక, బౌద్ధిక, ఆధ్యాత్మికాలైన బహువిధ ఆకాంక్షలను శ్రేష్ఠతమ రీతిలో నెరవేర్చగల సన్మార్గాన్ని దీప్తిమంతం చేసి, నేటి ఆత్మహత్యా సదృశమైన భౌతికవాదపు ఉన్మాదం నుంచి మానవజాతిని రక్షించే కార్యం.

క్లుప్తంగా చెప్పాలంటే— "ఈ సనాతనమైన మన మాతృదేవి మరల మేల్కాంచి తన సింహాసనంపై అపూర్వ వైభవంతో విరాజిల్లుతూ పునరధిష్ఠితయైన దృశ్యం నా ముందు సుస్పష్టంగా సజీవంగా గోచరిస్తున్నది" అంటూ ఏ దృశ్యాన్నయితే స్వామి వివేకానంద ముందే దర్శించి ప్రవచించారో, ఏ దివ్యస్వప్నం గతంలోని తరతరాల భారతీయుల హృదయాలను ఉర్రూతలూగించిందో– ఆ స్వప్నమే జాతినంతటిని ఎడతెగని ఉద్యమాలకు, త్యాగాలకు సంసిద్ధం చేసే స్ఫూర్తిని ప్రసాదిస్తున్నది.



